# సంఖ్యాశాస్త్రము

## (NUMEROLOGY IN TELUGU)

జ్యోతిష గ్రంథము



వకలో
యత్నా
వ్య
యే
వరింప
నకును

పవని
లలో,
తములు
కొను
నము-
- కోర్ట
ము -
ములు-
నుండు
ముగ
మైనది.
రూ. 8.00


వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్
26, రామానుజ అయ్యర్ వీధి, మద్రాసు-21.

శ్రీ ర స్తు

# కపాలకుండల

(బంకించంద్రచట్టోపాధ్యాయగారి బంగాలీనవలకు తెనుఁగు)

రచయిత:

శ్రీ యం. రామరావు, బి. ఏ



తృతీయ ముద్రణము.

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము.

1954

# పీఠిక

"కపాలకుండల" అను నీనవీనకథా (నవలా) గ్రంథ కర్తలైన శ్రీబంకించంద్రచట్టోపాధ్యాయులవారి రచనాకౌశల మును, విద్యావైదుష్యమును నా యితర పరివర్తనగ్రంథము లైన "ఆనందమఠము"; "రాధారాణి" మొదలగువానిని పఠి యించిన మహాశయు లెఱింగియే యున్నారు; కనుక విస్తరించి వ్రాయం బనిలేదు. బంగాళదేశమందు శ్రీబంకించంద్రచట్టో పాధ్యాయులవారు అద్వితీయ కల్పనాశక్తి గలవారని ప్రసిద్ధి నొందినదేగాక, వారిగ్రంథములు ఇతర దేశభాషలందు పరివ ర్తనమగుట కారంభించినది మొదలు సకలదేశములందును ప్రసిద్ధినొందిరి. ఆంగ్లేయదేశమం దెట్లు షేక్స్పియర్ నవీన కథలు నిర్మించుటయం దద్వితీయులని కీర్తివడసిరో, యట్లు హిందూదేశమునందు శ్రీబంకించంద్రచట్టోపాధ్యాయులు నవీన కథలు నిర్మించుటయందును అద్వితీయు లని కీర్తిగాంచిరి. మఱియు, భావగర్భితపదప్రయోజనమునందు కాళిదాసుతోను, యుక్తియందు బాణభట్ట దండికవులతోడను సమానశక్తి కలవారు. వీరి బంగాళీ నవలలు ఇంకను పరివర్తనము లగు చున్నవి. సామాన్యబుద్ధి గలవారిచే నిర్మించు నవల రస భంగముగను ఏహ్యమైన కథాచమత్కృతి గలదగను నుండును. ఈ ప్రజ్ఞాశాలి రచియించు నవలలు మిగుల గంభీరభావమును

రసమును ఔచిత్యమును బోధ చేయుచుండును. దేశభాషలం దెవరు నవీనకథలు వ్రాయతలంతురో వారెల్లరును వీరిపద్ధతి ననుకరింపవలయును. అట్లనుకరింపనివారి గ్రంథములు రసవిహీన ముగ నుండుననియే మా యభిప్రాయము. ఈ కపాలకుండల యొక్క ఉత్కృష్ట కల్పన కచ్చెరువొంది లండన్ నగరము నందు హెచ్. డి. ఫిలిప్స్ అనువారు ఆంగ్లేయభాషయందును; లీప్‌జిగ్ పట్టణమందు సి. క్లైం అనువారు జర్మన్‌భాషయందును పరివర్తనము చేసిరి. మఱియు హిందూదేశములోని పెక్కు భాషలయందును పరివర్తనము చేయఁబడి యున్నది. నేను ఈపరివర్తనమును మైసూరులోనుండు పెన్షన్డ్ మేజస్ట్రీట్ శ్రీమాన్ బి. వేంకటాచార్యులు, బి. ఏ. గారి కర్ణాటక గ్రంథాధారముచే నాంధ్రీకరించితిని. పాఠకుల యాదరాతిశయ మునకుఁ దగినట్లు లింకను నిట్టి నవలలను రచియింపఁ దలంపు గొనియున్నాఁడను.

ఇట్లు,

గ్రంథకర్త.

శ్రీరస్తు

# కపాలకుండల

## మొదటిప్రకరణము

### సాగరసంగమము

"Floating straight obedient to the stream"

—*Comedy of Errors.*

ఇన్నూటయేఁబదియేండ్లకు ముందు మాఘమాసమునం దొకనాఁడు గంగాసాగరమునుండి ఒకయోడ వెనుదిరిగి వచ్చుచుండెను. ఆకాలమున, నౌకాప్రయాణము చేయువా రందఱును పోర్చుగీసులకును, ఓడదొంగలకును భయపడి నాలుగైదుఓడలను జతచేసికొని బయలుదేరుట వాడుకయైయుండెను. అయినను, పైనిచెప్పిన ప్రయాణీకులు ఒంటరిగా పోవుచుండిరి. నావికులు దిఙ్నిరూపముచేయుటకు శక్తిచాలక రేవును (Tide) వదలిపెట్టి చాలదూరము పోయిరి. ఇపు డేదిక్కునందు ఎచ్చటికి పోవుచున్నామని తెలియనివారైరి. ప్రయాణికులలో ననేకులు నిద్రపోవుచుండిరి. ఒకవృద్ధుఁడును ఒక యువకుఁడును మాత్రము మేల్కొనియుండిరి. ఆవృద్ధుఁడు యువకునితో మాటలాడుటమాని, నావికులనుజూచి, "ఈదిన మెంతదూరము పోనగుచు?" అని యడిగెను. వారిలో నొకఁడు నలుదెసలు చూచి, "చెప్పుటకు కా"దనెను.

వృద్ధుఁడు క్రుద్ధుఁడై వానిని తిట్టెను. యువకుఁడు, "స్వామీ! ఏది జగదీశ్వరుని యిష్టమునందున్నదో దానిని పండితులుకూడ చెప్పలేరు. ఈమూర్ఖుఁ డేమిచెప్పఁగలఁడు? తాము కోపింపఁగూడ" దనెను.

వృద్ధుఁడు ఉగ్రభావముతో, "కోపముచేయఁగూడదా? నీవు చెప్పుము, చూతము; ఎవరో దొంగలు ముప్పదియేకరాల భూమియందున్న పంటనంతయు నురుచుకొనిపోయిరఁట! ఇఁక సంవత్సరముదాఁక పిల్లలు తినునదేమి? చెప్పు"మనెను. యువకుఁడు మాటాడక మిన్నకుండెను.

వృద్ధుఁడు ఈసమాచారము ఊరినుండివచ్చిన ప్రయాణికులవలన తెలిసికొనెను.

యువకుఁడు, "నేను తాము గ్రామము విడిచివచ్చుట సరికాదని యపుడే చెప్పినాఁడనుగదా? తాము వచ్చినది సరికా" దనెను.

ముసలివాఁడు ముందువలెనే కోపముతో, "రాఁదగదా? ముప్పాతికకాలము ముగిసెను; ఇఁక నుండు టేమి నిజము? ఇపుడైనను పరలోకసాధనమైన పనిని చేయకున్న మఱెప్పుడు చేయనగును?" అనెను.

యువకుఁడు, "నాకు శాస్త్రము తెలియదు. విన్నదానిని చెప్పుచున్నాను—ఏమనఁగా, తీర్థయాత్రలచేతను, దేవతా దర్శనములచేతను, కాఁదగిన పరలోకసాధనములను, గృహము నందుండియే చేసికొనవచ్చునని వినియున్నాఁడను." అనెను.

వృద్ధః—అట్లయిన నీ వేలవచ్చితివి?

## మొదటి ప్రకరణము

యువ:—నేను మొదటనే చెప్పియున్నాఁడనుకదా, సముద్ర యాత్ర చేయవలయు నని మిక్కిలి కోరిక యుండెను. కావుననే వచ్చితిని.

కొంచెమునే పూరక యుండి యువకుఁడు తనలోఁ దాను, "ఆహా! ఏమి యాశ్చర్యము? నేఁ జూచినదానిని జన్మ జన్మాంతరమునను మఱువను!" అని యనుకొని,

"దూరాదయశ్చక్ర నిభస్యతన్వీ
తమాలతాలీ వనరాజనీలా,
ఆభాతి వేలా లవణామ్బురాశే
ర్ధారా నిబద్ధేవ కలఙ్క రేఖా."

అను నీశ్లోకమును పఠించెను. అయినను, ఈశ్లోకము ముసలివాని చెవిని బడలేదు; నావికులు మాటలాడుటను వినుచుండెను.

ఒకఁడు మఱొకనితో "అన్నా! కార్యము చెడెను; ఇప్పు డేగట్టున నున్నామో? ఏదేశమునకు వచ్చినామో? ఏదియు తెలియ లేదు." అనెను.

ఈమాట భయసూచకమై యున్నందున, వృద్ధుఁడు ఏదో విపత్తు సంభవించి యున్నదనెడి సంశయము కల్గి భయపడి, "ఇప్పు డేమైనదని" యడిగెను. నావికుఁడు ఉత్తరమీయ లేదు. యువకుఁడు ఉత్తరమును నిరీక్షింపక, ఓడపై మెట్టెక్కి నలువైపులఁ జూచెను. అపుడే వెన్నెల మాయుచుండెను. నలుదెసలందు మేఘము క్రమ్ముకొని యుండెను. ముసలధారగా వర్షించు మేఘముతోఁగూడ ప్రచండవాయువును దిగంతవ్యాప్త మగుచుండెను. ఆకాశము, నక్షత్రములు, చంద్రుఁడు, కూలము, ఉప

కూలము, ఏదియు కనఁబడలేదు. నావికులకు దిగ్భ్రమ కలిగె నని తోఁచెను. ఓడ యేదిక్కునందు పోవుచుండెనో తెలియ లేదు. ఓడ కూలమును జేరక సమీపసముద్రమును జేరిపోవు నేమో యని నావికులు భయపడుచుండిరి. మంచు పడకుండు టకై ఓడకు మూఁతవేసి యుండినందున, లోపలనున్న ప్రయా ణికుల కేదియు తెలియకుండెను. యువకుఁడు బైటవచ్చి చూచి, యట్లే లోపలికినిఁ బోయి చూచివచ్చి ముసలివా నితో తత్కాలస్థితినంతయుఁ జెప్పెను. అంత ఓడయందు మహాకోలాహలము ప్రారంభమైనది. ఓడలో శయనించియున్న స్త్రీలు మేల్కొని వారువా గాడుమాటలను విని ఆర్తనా దము చేయందొడంగిరి. వృద్ధుఁడు "గట్టుచేర్చు, గట్టుచేర్చు" అనెను.

యువకుఁడు కొంచెము నవ్వి, "గట్టెక్కడ నున్నది? అది తెలిసియుండెనేని యింతటి విపత్తునకు కారణమే లేదు." అనెను.

దీనిని విని, నౌకారోహకులు మిక్కిలి రోదనము చేయం దొడంగిరి. అప్పుడు యువకుఁడు వారిని సమాధానపఱచి, ఓడ నడుపువారినిం జూచి, "భయము పడవలసినది లేదు. వెన్నెల మాయుచున్నది; ఇఁక రెండు మూఁడు గడియలలో తెల్లవా రును; అంతలో ఓడ యెచ్చటికిని పోదు; తెరచాపలు విప్పి వేయుఁడు; ప్రవాహము పోవుమార్గముగ ఓడను విడిచి పెట్టుఁడు." అనెను.

నావికులు, ఈపరామర్శ సరియైన దని యట్లే చేసిరి.

కొంతసేపు ఓడను అది పోయినరీతిగా విడిచిపెట్టిరి. ప్రయాణికులు భయముతో కంఠగతప్రాణులై యుండిరి. గాలి

లేనందున, తరంగాందోళనముచేఁ గల్గు కంపము లేకుండెను. స్త్రీలందఱును గొంతెత్తి వివిధశబ్దవిన్యాసములతో నేడ్చుటకు ప్రారంభించిరి. గంగాసాగరమునందు శిశువును విసర్జనము చేయ వచ్చియుండిన యొకస్త్రీ శిశువును విసర్జించి, మరల నీటి నుండి యెత్తుటకు చేతఁగాకుండెను. అదియొక్కతె మాత్రము ఏడువకుండెను.

ఇట్లు పోవుచుండఁగా ఉదయమై జాముసేపైనట్లు తోఁచెను. అపుడు నావికులు ఉన్నట్లుండి సముద్రమునందలి పంచపీర్ల * కీర్తనము చేసిరి. ప్రయాణీకులు పీర్ల నామకీర్తనమును విని, ఏమి! ఏమి! † మాఝి! ఏమైనది! అని యందఱు నొక్కమాటే యడుగఁ దొడంగిరి. మాఝు లందఱు నేకకంఠముతో "సూర్యోదయము! సూర్యోదయము! భూమి కనఁబడెను! భూమి కనఁబడెను!" అని యఱచిరి. యాత్రార్థు లందఱును ఔత్సుక్యముతో ఎచ్చట నున్నాము! ఏమిసంగతి! తెలిసికొందమని మాటలాడుచు ఓడయంచునకు వచ్చి నిలువంబడి చూడఁగా సూర్యుఁడు ప్రకాశమానుండై కనంబడెను. దిఙ్మండలము చండమారుతముచే ముక్తమై కనఁబడుచుండెను. అపుడే ప్రొద్దెక్కియుండెను. ఓడ యున్నస్థలము మహాసముద్రముగా లేదు. నదీముఖమై యుండెను. అయినను,

* పీర్ అనఁగా ముసల్మానులలో మహాత్ములకు పేరు. తురకలలో ఓడ నడుపువారు, వారి మతానుసారముగా సముద్రమునందు ఐదుగురు మహాత్ము లున్నారనియును, కష్టమువచ్చినపుడు వారిని స్మరించిన మేలగు ననియును భావించెదరు.

† మాఝి అనఁగా తురకభాషలో ఓడనడుపువానికి పేరు.

ఆప్రదేశము మిగుల విస్తారముగ నుండెను. అంత విస్తారముగ మఱెచ్చటను లేదు. నదీతీరము ఓడకు సుమారు ఏఁబది బారల దూరమున నుండెను. వేరేగట్టు కండ్లకుఁ గనఁబడలేదు. ఎచ్చోటఁ జూచినను అనంతమైన జలరాశి రవిరశ్మిమాలికచే ప్రదీప్తమై ఆకాశప్రాంతమునందు ఆకాశముతోఁ గూడియున్న ట్లుండెను. అచ్చట నున్న జలమంతయు మట్టిచేఁ గలిసి నదీజలవర్ణముగా నుండెను. అయినను, దూరమునందున్న జలరాశి నీలప్రభ కలదై యుండెను. ప్రయాణికు లెల్లరును మహాసముద్రమును జేరియున్నామనియును ఇపుడు ఒక ఉపకూలము సమీపముగ నున్నందువలన భయమేమియును లేదనియును తలంచిరి. సూర్యునింజూచి దిక్కును దెలిసికొనిరి. సమీపమునందు కనంబడిన కూలము సముద్రపు పడమటిగట్టని స్థిరపఱిచికొనిరి. గట్టునందు ఓడకు కొంచెము దూరమునందు మందగామినియైన చిన్నయేఱు అజలరాశితో సంగమమగుచుండెను. ఆసంగమమునకు పడమర నొక పెద్ద యిసుకదిబ్బమీఁద టిట్టిభము లాదిగాఁగల యనేకపక్షులు క్రీడించుచుండెను. ఈ చిన్నయేటికి రసూల్‌పురనది యని పేరు.

# రెండవప్రకరణము

## ఉపకూలము.

"Ingratitude! Thou marble-hearted fiend!"

—*King Lear*.

ప్రయాణికుల స్ఫూర్తివ్యంజకమైన మాటలెల్ల ముగిసిన మీఁద, నావికులు తమలోఁ దాము గట్టు చేరుట కింకను చాల

నేపు పట్టును. ఈలోపల ఎదురుగాఁ గనఁబడు ఇసుకదిబ్బయందు వంటచేసి భోజనము చేసికొని, జలోచ్ఛ్వాసము ప్రారంభమైన తోడనే స్వదేశాభిముఖమై పోవచ్చు నని మాటలాడుకొనిరి. వారిమాటలను ప్రయాణికులు విని "అట్లే చేయవచ్చును, అదే మంచిదని" యని నావికులు పడవను దరికితెచ్చి కట్టిరి. ఆరోహకులెల్లరును దిగి స్నానాదికృత్యములను నెఱవేర్చుకొనుట కారంభించిరి.

స్నానాదులైనపిదప, పాకముచేసికొనుట కొక అభ్యంతరము కలిగెను. ఓడలో వంటచేయుటకు కట్టెలు లేవు. వ్యాఘ్రములు మొదలగు వన్యమృగముల భయమువలన అడవికిఁబోయి కట్టెలు తెచ్చుటకు ఎవరును సమ్మతింపలేదు. అందుచే నందఱును ఉపవాస ముండవలసినట్లు సంభవించినందున, ముసలివాఁడు మున్ను చెప్పిన యువకునిం జూచి, "అన్నా, నవకుమారా! నీవు దీని కేదేని యుపాయము చేసితివేని అందఱును భోజనముచేయఁదురు, లేనియెడల అందఱును అన్నము లేక మలమల మాఁడి చావవలసినదే." అనెను.

నవకుమారుఁడు కొంచెమునే పాలోచించి, "మంచిది, నేనే పోయెదను, గొడ్డలి యియ్యండి, అయినను ఇంకొకఁడు కత్తితీసుకొని నావెంట రానిండు" అనెను. నవకుమారునితోఁ గూడ పోవుటకు ఎవరును సమ్మతిపడలేదు.

అంత నవకుమారుఁడు, "వాఁడు భోజనముచేయునపుడు తెలియును, అపుడు చూతము" అని చెప్పుచు దోవతిని నడుమునకు కట్టుకొని గొడ్డలిని భుజముపై నుంచికొని కట్టెలుగొట్టి తెచ్చుటకై వెడలిపోయెను.

నవకుమారుఁడు గట్టున నుండు ఇసుకదిబ్బపై నెక్కిపోయి కండ్లకందినదూరము చూడఁగా నెచ్చటను కట్టెలుగొట్టఁదగిన యనుకూలస్థలము కనఁబడలేదు. గొండారణ్యముగ నుండెను. పెద్ద పెద్దమ్రానులుండెను. అయినను. దట్టముగ నుండలేదు. అచ్చటచ్చట చిన్న చిన్న చెట్లు మండలాకారముగా నుండెను. వంటకట్టెల కుపయోగమైనవిగాఁ గనఁబడలేదు. కావున, నవకుమారుఁడు కట్టెలుండుచోటును వెదకుచు నదీతీరమునకు చాలదూరము పోయెను. తుదకు కట్టెలకు పనికివచ్చు చెట్టును జూచి వానిని నఱికి మోపుగాఁగట్టి మోచికొని వచ్చుట మిక్కిలి కష్టమైనది. నవకుమారుఁడు దరిద్రుఁడు కాఁడు. వాని కిట్టిపనియందు అభ్యాసములేదు. ఆలోచనలేక యీపనికై యొప్పుకొన్నాఁడు. అయినను, నవకుమారుఁడు ఏపనినైనను చేయఁ బూనినయెడల అలసత్వముతోఁ బ్రవర్తింపని స్వభావము కలవాఁడై యుండినందున ఎట్లో శ్రమపడి కట్టెలు కొట్టి మోచికొని వచ్చుచుండెను. కొంచెముదూరము పోవుట, అచ్చట విశ్రాంతినొందుట, మరల నచ్చోటునుండి వెడలుట, మరల బడలిక దీర్చికొనుట, ఇట్లుగా వచ్చుచుండెను.

ఈకారణముచేత నవకుమారుఁడు కట్టెలమోపు తెచ్చుటకు కాలవిలంబమైనది. ఇంతలో వాని తోడిప్రయాణికులు నవకుమారుఁడు చాలసేపుదాఁక రానందున, ఉద్విగ్నచిత్తులై నవకుమారుని పులియెత్తుకొని పోయియుండునని యనుమానమొందిరి. వాఁడు మరలివచ్చుప్రొద్దు మీఱిపోయినందుచే వారి యనుమానము స్థిరమైనది. వారిలో తీరమునకుఁబోయి చూచి వచ్చునంతటి సాహసము కలవా రెవ్వరును లేరు.

నౌకారోహకులు ఇవ్విధముగా నాలోచించుచుండు సమయమున జలరాశియందు అత్యంత కల్లోలము లేచెను. దానింజూచి నావికులు దరితట్టు నని దిగులొందిరి. ఇట్టి జలోచ్ఛ్వాసము లేచినపుడు ఓడ గట్టుచెంత నున్నయెడల అలల తాఁకుడుచే తుత్తునియలై పోవు నని తెలిసినవా రగుటంబట్టి మిగుల తొందరపాటుచే ఓడను కట్టియున్న దారములను విప్పి నదీగర్భమునకు తీసికొనిపోవుటకు ప్రయత్నించిరి. ఓడను విప్పిరో, లేదో, ఆలోపల ముందఱ కనఁబడుచున్న యిసుక దిబ్బ నీటిలో మునిఁగిపోయెను. వంటకు సిద్ధపఱిచి యుంచుకొనియున్న పాత్రలు మొదలగువానిని అచ్చటచ్చటనే విడిచిపెట్టి ప్రయాణికు లెల్లరును ఓడ నెక్కిరి. పాత్రములన్నియు నీటిపై తేలిపోవుచుండెను. వారి యదృష్టమునకుఁ దగినట్లు నావికులు అసమర్థులై యున్నందున సమయమునకుఁ దగినట్లు నడుపుటకు శక్తిలేనివారై యుండిరి. ప్రబలమైన జలప్రవాహవేగము ఓడను రసూలపురనదియొక్క మధ్యభాగమునకు కొట్టుకొనిపోయెను. యాత్రార్థులలో నొక్కఁడు, నవకుమారుఁడు నిల్చిపోయెను. అని కేకవేసెను. దానిని విని నావికులలో నొకఁడు, "నీనవకుమారుఁ డెచ్చట నున్నాఁడు? వానిని నక్కయో కుక్కయో తినిపోయెను." అనెను.

జలప్రవాహవేగము ఓడను రసూల్‌పురనదియొక్క నడిమికి త్రోసికొని పోవుచుండెను. వెనుక తిరిగి వచ్చుట కష్టమని తెలిసి నావికులు దానిని బయటికి తెచ్చుటకు మిక్కిలి ప్రయత్నము చేసిరి. వారి శరీరమంతయు చెమర్చెను. ఇట్లు మహాప్రయత్నముతో ఓడను దరిచేర్చిరి; అయినను, అచ్చటి

ప్రబల ప్రవాహవేగమువలన ఓడ రావేగమె బాణవేగముతో ఉత్తరముఖముగా తిరిగిపోయెను. నావికులు దానిని కొంచెమైనను త్రిప్పుటకు శక్తిచాలనివారైరి. ఓడ వెనుకకు దిరుగలేదు.

జలవేగముతగ్గి ఓడను నిల్పుటకు సాధ్యమైనపుడు చూడఁగా అదివరకె ఓడ రసూల్‌పురనదీముఖమును విడిచి చాల దూరము పోయియుండెను. ఇపుడు నవకుమారుని పిలుచుకొని వచ్చుటకు వెనుకతిరిగి పోవలయునా? అక్కఱలేదా? అనెడి విషయమునుగూర్చి తర్కముజరిగెను. ఇట్లు వితర్కించినవారు నవకుమారుని సహయాత్రికులేగాని వాని బంధువులుకారు. వెనుక మరలుట యనుట జలప్రవాహమున కెదురుగా పోవలసినది. అది మిగుల ప్రయాసము. అంతలో రాత్రి యగును. రాత్రియందు ఓడను నడుపుట అతికష్టము. మఱునాఁడు గట్టు చేరుటకై కాచికొని యుండవలయును. అంత దనుక ప్రవాసు లెల్లరును అన్నములేక యుండవలయును. ఇదివఱకే రెండు దినములు ఉపవాసము. ఇంతలో అందఱకును ప్రాణము ఓష్ఠాగతమైపోవును అని యాలోచించిరి. మఱియు నావికులు వెనుక పోవుటకు సమ్మతింపరు. చెప్పిన వినరు. నవకుమారుని పులి తిని యుండును; ఇఁకపోయి ప్రయోజనములేదని నిర్ధారణ చేసికొనిరి.

ఇట్లు అందఱును నిర్ధారణచేసికొని నవకుమారుని విడిచిపెట్టి స్వదేశగమనోన్ముఖులైరి. ఉపకారముచేయుతలంపుతో నడవికేఁగిన నవకుమారుని మాత్రము ఆ భీషణమైన సముద్రతీరమునందు వనవాసిగా విడిచిపెట్టిపోయిరి.

ఇందువలన పరులయొక్క ఉపవాసనివారణార్థమై కాష్ఠాహారణమునకు పోఁగూడదని ప్రతిజ్ఞ చేయువారు, ఈ యాత్రికులవంటి మూఢులేయగుదురు. ఉపకారముచేయు వారిని వనవాసమునందు విసర్జనముచేయుట యెవరికి స్వభావముగ నుండునో వారు చిరకాలము ఆత్మోపకారులకు వనవాసమునే యొసంగుదురు. అయినను, వనవాసమైనను పరులకొఱకు కాష్ఠాహారణముచేయుట యెవరికి స్వభావమో, వారు మరల పరులకొఱకు కాష్ఠాహారణమునకుపోకుందురా? వారు, "మీరు అధములైనంతమాత్రమున మేమేల ఉత్తములము కాకూడ" దని చెప్పుదురు.

# మూఁడవ ప్రకరణము

## విజనప్రదేశము

"Like a veil,
Which if withdrawn, should but disclose the frown
Of one who hates us, so the night was shown
And grimly darken'd o'er their faces pale
And hopeless eyes,"

—*Don Juan.*

ఏస్థలమునందు యాత్రికులు నవకుమారుని విడిచిపెట్టి పోయిరో అచ్చట నిపుడు దౌలత్‌పురమనియు, దరియాపురమనియు పేర్లుగల రెండుగ్రామము లున్నవి. మనము ఏకాలముయొక్క వృత్తాంతమును జెప్పుట కుద్యమించితిమో, ఆకాలమునందు అచ్చట మనుష్యులు సంచారము సేయుచు

నుండి రనుట కేవిధమైన యానవాలును గనంబడలేదు. అది మహారణ్యమయమై యుండెను. అయినను, బంగాళా దేశము యొక్క యుతర ప్రదేశములయందు జనసంచార మున్నంత యిచ్చట లేదు. రసూల్‌పురమునుండి సువర్ణరేఖానదిపర్యంత మును అనేక యోజనములు ఒకే విధముగా ఇసుకరాసి గుట్టలు గుట్టలుగా కనంబడుచుండెను. ఇపుడును దానిని 'ఇసుకగుట్ట' లని చెప్పుచున్నారు. ఈయిసుకగుట్టల ధవళమైన శిఖరమాలికలు మధ్యాహ్నసూర్యకిరణమునందు దూరముగనుండి చూచితి మేని అతిశయప్రభ కలదిగాఁ గానంబడును. ఆగుట్టలమీఁద గొప్పవృక్షములు పెరుగుటలేదు. వాని యడుగుభాగమునందు మాత్రము మండలాకారమైయుండుచెట్లతోఁ గూడ చిట్టీదు, పిల్లపీచర మొదలగు చిన్నచిన్న అడవిచెట్లును తీఁగె జాతులును విశేషముగా నుండెను.

ఇట్టి ప్రఫుల్లమైన విహీనస్థలమునందు నవకుమారుఁడు సహాయాత్రికులనుండి త్యజింపఁబడెను. వాఁడు కట్టెలమోపును మోచికొని నదీతీరమునకువచ్చి చూడఁగా ఓడ కనఁబడలేదు. వానికి అకస్మాత్తుగా భయము కలిగెను. అయినను, వాఁడు తన మనస్సునందు సహచరులు తన్ను విడిచిపెట్టి పోయిరని యెంచలేదు. జలోచ్ఛ్వాసముచేత ఇసుకదిబ్బలు మునిఁగిపోయినందున వేఱుస్థలమునకుఁబోయి యుందురనియును, తన్ను వచ్చి పిలిచికొని పోవుదురనియును నిరీక్షించుచుండెను. కాని, ఎంతసేపటికిని ఓడ రాలేదు. యాత్రార్థులలో నొక్కఁడైనను గనంబడలేదు. నవకుమారుఁడు ఆఁకలిచేత మిగుల శ్రమనొంది చాలసేపు నిరీక్షించుటకు వలనుపడక నదీతీరము

నందు ఓడను వెదుక నారంభించెను. ఎంతదూరముపోయిచూచి నప్పటికిని ఎచ్చటను ఓడ కనఁబడనందున, మొదటఁ గూర్చుం డిన స్థలమునకు మరలివచ్చి కూర్చుండెను. అంత వాఁడు ప్రవాహవేగముచే కొట్టుకొనిపోయియుండు ననియును, ఎదురు తిరిగి వచ్చుటకు కాలవిలంబ మగుననియును ఎంచుకొనెను. మఱికొంతసేపటికంతయు ప్రవాహము తగ్గిపోయెను. ఇఁక ఓడవచ్చి చేరునని యూహించికొనెను. అయిననేమి ? మరల జలోచ్ఛ్వాసము వృద్ధియగుచుండెను. క్రమముగా ప్రొద్దును పోవుచుండెను. సూర్యుఁడును అస్తగతుఁడాయెను. "ఓడ వెనుక తిరిగి రావలసి యున్నయెడల ఇంతసేపటికే వచ్చియుండు నని యును, అది అలల తాఁకుడువలన మునిఁగిపోయియుండు నని యును, అట్లు కాకున్నచో తోడివారు నన్నొంటరిగా విడిచి పోరనియును" నవకుమారుఁడు భావించికొనెను.

కొండల అడివారమునఁ గాపుర ముండువారిపై పర్వత శిఖరము జాఱిపడినచో నెట్లు నిష్పేషితులగుదురో, యట్లు జతగాండ్రు తన్ను విడిచిపెట్టి పోయిరనెడి తలంపు మనస్సునకు తోఁచినతోడనే నవకుమారుని హృదయము ఝర్ఝరితమైనది.

ఆ సమయమునందు నవకుమారుని హృదయస్థితి యె ట్లుండినదో దానిని వర్ణించుట కెరితరము? తన జతగాండ్రు ప్రాణ ముతో మునిఁగిపోయి యుందురనెడి సంశయముచేఁ బరితాప మొందినవాఁడైనను, ఆ పరితాపము తన విపత్తునుగూర్చి యాలోచించుటచేత త్వరగా మఱచిపోయెను. ఒకవేళ జత గాండ్రు, తన్ను విడిచిపెట్టి పోయియుందురనెడి తలంపుచేఁ

గలిగిన క్రోధవేగముచేతఁ గూడ పరితాపము దూరమగును కదా?

నవకుమారుఁడు నలుదెసలు చూచెను. ఎచ్చోటను గ్రామముగాని, ఆశ్రయముగాని, జనులుగాని కనఁబడలేదు. ఆహారపదార్థములు లేవు. త్రాగుటకు నీళ్లును లేవు. ఆయేటినీళ్లు క్షారముగ నుండెను. క్షుత్పిపాసలచే నవకుమారుఁడు సొలయుచుండెను. దురంతమైన శీతమును నివారణచేసికొనుటకు ఆశ్రయము లేదు. నదీతీరమునందు మంచుచేత చల్లనిగాలి వీచుచున్నట్టి ప్రదేశమున నిరాశ్రయమై నిరావరణముగ పరుండవలసి వచ్చెను. ఇదియునుగాక, రాత్రియందు పులులు ఎలుగుగొడ్లు వచ్చి తినిపోవునని యును, ఈపూట కాకున్న రేపైనను వచ్చి తినిపోవునని యును తలంచెను

ఇట్లు మనశ్చాంచల్యముచేత నవకుమారుఁడు ఒకేస్థలమునందు చాలసేపు పరుండలేక, నదీతీరమునుండి లేచి తిరుగ నారంభించెను. క్రమముగా అంధకార మాయెను. శిశిరఋతువులో నాకాశమునందు నక్షత్రములు మినుకు మినుకని ప్రకాశించుచుండెను. అంధకారము—ఎచ్చోటను జనవిహీనమై యుండెను. ఆకాశము, ప్రాంతరము, సముద్రము, సర్వత్ర నిశ్శబ్దము—అవిరతముగా కల్లోలమైన సముద్రగర్జనము; ఒక్కొక్కపుడు వన్యమృగముల ధ్వని; అయినను నవకుమారుఁడా యంధకారమునందు ఆ శీతమును వర్షించు ఆకాశతలమునందు ఇసుకదిబ్బలలో నలుదిక్కులందును సంచరింప నారంభించెను. ఒకప్పుడు ఉపత్యకమునందును, మఱొకప్పుడు అధిత్యకమునందును, ఒకప్పుడు వాలుకారాశి శిఖరమునందును, ఒకప్పుడు

అడివారమునందును తిరుగుచుండెను. తిరుగునపుడు మాటి మాటికి అడవిమృగముల భయము. ఒకచోటఁ గూర్చుండుట కును అదే భయము.

తిరిగి తిరిగి శ్రమమైనది. పగలంతయు ఆహారములేనం దున అధికశ్రమముగా నుండెను. ఒక్కచోట ఇసుకదిబ్బ కాను కొని కూర్చుండెను. ఇంటియందలి సుఖశయ్య జ్ఞప్తికి వచ్చెను. శారీరక మానసిక క్లేశములయొక్క చింత కల్గినయెడల దాని తోడ నిద్రయు వచ్చును. నవకుమారుఁడు చింతించుచుండు నపుడు కనులు మూతఁబడుట కారంభించెను. ఇట్టి నియమమును ఈశ్వరుఁడు కల్పించకున్నయెడల సాంసారికక్లేశమును ఎవ్వ రును సహింపరని తోఁచుచున్నది.

# నాల్గవ ప్రకరణము

## స్తూపశిఖరము

"అదూరదేశవర్తినం సవిస్మయం దదర్శతం
భయంకరాకృతి సంయుతాతిఘోరరక్తమూర్తినమ్."

—మేఘనాదవధము

నవకుమారునకు మెలకువ వచ్చినపుడు గాఢాంధకార ముగానుండెను. వాఁడు తన్ను పులి తినలేదని తెలిసికొని మిగు నాశ్చర్యమొందెను. పులి వచ్చుచున్నదో యేమోయని అట్టిట్టు చూచెను. అకస్మాత్తుగా ఎదురుగా వెల్తుగు కనఁబడెను. ఇది భ్రమగా నుండునని తలంచియు దానినే చూచెను. ఇట్లు

చూచుచుండఁగా వెల్తురుయొక్క పరిధి హెచ్చయి మహో జ్జ్వలమగుచుండెను. అది నిప్పుమంటయే యని భావించెను. ఇట్టి నిశ్చయజ్ఞానము కలిగినతోడనే నవకుమారునకు ప్రాణము మీఁదియాశ పునరుద్దీప్త మైనది. మనుష్య సమాగమము లేక యీవెల్తురు కల్గుటకు హేతువులేదని నిశ్చయించి యచట నుండి వెల్తురు కనఁబడిన దిక్కునుఁగూర్చి నడిచెను. ఒక్కొక పుడు మనస్సులో నీవెల్తురు కొంఅవిదయ్యముదిగ నుండు నేమో యని యెంచెను. అయినను ఆ యనుమానమును పరిహ రించుకొని నిర్భీతచిత్తుఁడై పోవుచుండెను. అచ్చటచ్చట మార్గ మున కడ్డముగనుండు చెట్లుచేమలను త్రోసికొని యిసుకగుట్టల నెక్కుచు దిగుచు పోయెను. ఇట్లు పోఁగాపోఁగా ఆవెల్తురు యిసుకదిబ్బ మీఁది భాగమున నుండుచుండెను. అచ్చోట గూర్చుండియున్న యొక పురుషునిరూపము ఆకాశపటమున చిత్రితమైనట్లు కనఁబడెను. నవకుమారుఁడు ఆవాలుకాశిఖరము నందు కూర్చుండియున్న పురుషునియొద్దకుఁ బోవలయు ననెడి స్థిరసంకల్పము కలవాఁడై వేగముగాఁ బోయెను. ఇసుకదిబ్బపై నెక్కుట కారంభించునపుడు మనస్సునందు భీతి కలిగెను. అయినను వెనుదీయక దానిమీఁద నెక్కిపోయి చూచెను. చూచి ఒడలు గగుర్పొడువ భయవిహ్వలచిత్తుఁడై కూర్చుం డుటకును వెనుకఁ దిరిగి పోవుటకును తోఁచక నిశ్చేష్టితుఁడై యుండెను.

శిఖరాసీనుండైన యామనుష్యుఁడు కనులుమూసికొని ధ్యానమునం దుండెను. వాఁడు నవకుమారుఁ డచ్చటికిపోయి నపుడు చూడలేదు. నవకుమారుఁడు తనమనస్సును వశపఱిచి

కొని చూచుచుండెను. కూర్చుండి యున్నవానికి సుమా రేబదియేండ్లుండును. నడుమునందు వస్త్రము గాని, లేక, వేఱేదిగాని యున్నట్లు తోఁచలేదు. కటినుండి జానుపర్యంత మును వ్యాఘ్రచర్మముతోఁ గప్పఁబడి యుండెను. కంఠము నందు రుద్రాక్షమాల లుండెను. విశాలమైన ముఖమండలము శ్మశ్రుజటాపరివేష్టితమై యుండెను. వానియెదుట కాష్ఠరాశి యందగ్ని ప్రజ్వరిల్లుచుండెను. ఈయగ్నిజ్వాలనుండి సహింప రాని దుర్గంధధూమము లేచెను. నవకుమారుని దృష్టి యా మనుష్యుఁడు కూర్చుండియున్న యాసనముమీఁద ప్రసరించి నందుచే దుర్గంధమునకు కారణము విశదమయ్యెను. ఆజటా ధారి శిరవిహీనమై విగళితమైన శవముపైఁ గూర్చుండి యుండెను. వానిసమీపమున రక్తవర్ణమైన ద్రవపదార్థము నిండిన నరకపాలము కనఁబడెను. అచ్చటచ్చట ఎముకలు పడి యుండెను. మఱియు యోగాసనాసీనుండై కూర్చుండియుండిన వాని కంఠమునందున్న రుద్రాక్షముల నడుమ యెముకలతునుక లుండెను. నవకుమారుఁడు భీతిజెంది మంత్రముచేఁ గట్టుపడిన వానివలె నిస్తబ్ధుఁడై యుండెను. నవకుమారున కాస్థలమును విడిచి పెట్టిపోవుటకు కాళ్లాడలేదు. వాఁడు కాపాలికుల మత వృత్తాంతమును వినియుండెను. కావున, దురంతమైన కాపాలికుఁ డని తెలిసికొనెను.

నవకుమారుఁ డచ్చటికిఁ బోయినపుడు కాపాలికుఁడు మంత్రసాధనమునందో, జపమునందో, ధ్యానమునందో మ గ్నుఁడై యుండినందువలన, నవకుమారునిపై దృష్టి ప్రసరించ

లేదు. కొంచెము సేపటికి వాఁడు కన్నులు దెఱచిచూచి 'కస్త్వమ్?' (నీ వెవరు?) అని ప్రశ్న చేసెను.

నవకుమారుఁడు (బ్రాహ్మణః) అని ఉత్తరము చెప్పెను.

కాపాలికుఁడు, 'తిష్ఠ' (కూర్చుండుము) అని చెప్పి యథాప్రకారము స్వకార్యమునందు ప్రవృత్తుఁడాయెను.

నవకుమారుఁడు నిలిచియుండెను. ఇట్లు అరజాము కడచెను. తర్వాత కాపాలికుఁడు లేచి, నవకుమారుని పూర్వము వలె సంస్కృతమున 'మమానుసర' (నావెంటరా) అనెను.

ఇతరసమయముగ నున్నయెడల నవకుమారుఁ డెంతమాత్రమును వాని వెంబడి పోయియుండఁడని చెప్పవలసినది లేదు. ఇపుడు క్షుత్పిపాసలచే ప్రాణము కంఠగతమై యున్నందున "ప్రభూ! ఆజ్ఞాప్రకారమే వచ్చెదను. అయినను, నేను అన్నపానములు లేక మిగుల డస్సియున్నాఁడను. ఎచ్చటికి పోయిన నివారణమగును? ఆజ్ఞ పాలింపవలయును" అని సవినయముగ నడిగెను.

కాపాలికుఁడు, "నీవు భైరవివలనఁ బంపఁబడినవాఁడవు. నా వెంబడిరా, ఆహారవస్తువులు లభించును" అనెను.

నవకుమారుఁడు కాపాలికుని వెంబడిపోయెను. ఇద్దరును చాలదూరము పోయిరి. మార్గమునందు ఎవరును ఏమియు మాటలాడలేదు. తుద కిర్వురును ఒక పర్ణకుటీరము చెంతకుఁ బోయిరి. కాపాలికుఁడు నవకుమారుని కుటీరద్వారముకడ నుండుమని చెప్పి, లోపల కేఁగి నిప్పుకలుగఁజేసి మంటబెట్టెను. నవకుమారుఁ డా వెల్తురులో చూడఁగా కుటీరమంతయు నొక విధమైన ఆకులతో నిర్మింపఁబడియుండెను. అందొకచోట కొన్ని

పులితోళ్లు నుండెను. వేఱొకచోట జలము, కాయలు, పండ్లు నుండినవి.

కాపాలికుఁడు నవకుమారునిజూచి, "నీవు పండ్లు మొదలగువానిని తిని, కలశమునందుండు నీళ్లుత్రాగుము. వ్యాఘ్రచర్మము లున్నవి. ఇష్టమైనచో కప్పుకొని పరుండుము. పులుల భయమేమియును లేదు. ఇంకొకప్పుడు నన్ను చూతువు. నన్ను చూచువఱకును ఈ కుటీరమును విడిచిపోవలదు" అని చెప్పెను.

ఇట్లని కాపాలికుఁడు చెప్పి వెడలిపోయెను. నవకుమారుఁడు సామాన్యమైన యాఫలములనుతిని, కొంచెము ఒగరైన జలమును త్రాగి, మిగుల సంతృప్తినొంది వ్యాఘ్రచర్మముపైఁ బరుండెను. దినమంతయు పడినశ్రమచేత వెంటనే నిద్రవచ్చెను.

# ఐదవ ప్రకరణము

## సముద్రతీరము

"......యోగప్రభావో న చ లక్ష్యతే తే,
బిభర్షి చాకారమనిర్వృతానాం
మృణాలినీహైమమివోపరాగమ్."

—రఘువంశము.

నవకుమారుఁడు ప్రాతఃకాలంబున లేచి ఊరికేఁగు నుపాయంబు నరయుటకై ప్రయత్నింపఁ దొడంగెను. వానికి కాపాలికునియొద్ద నుండుట శ్రేయస్కరముగా నగపడలేదు. అయినను, సులభముగా నీ వనమధ్యమునుండి బయలువెడలు టెట్లు?

ఈ కాపాలికుఁడుమాత్రము మార్గ మెఱుఁగును. అడిగినచోఁ జెప్పునా? నవకుమారునియెదుట కాపాలికుఁడు భయోత్పాదకరంబులగు కార్యము లేవియు చేయలేదు; గాన, వాఁ డెందులకు భీతిచేఁ గుందవలయును ? అయినను కాపాలికుఁడు తాను మరలివచ్చువఱకును కుటీరమును విడిచి పోవలదని చెప్పెను. అందులకు విరోధముగా వర్తించినచో నేమివాటిల్లునో! కాపాలికులు మంత్రబలముచే అసాధ్యమైన దానినైనను సాధింపఁగలరు. కాఁబట్టి వాని యాజ్ఞోల్లంఘన మనుచిత మని యాలోచించుచు నవకుమారుఁడు కుటీరమునందే యుండెను.

కాపాలికుఁడు అపరాహ్ణము వఱకును రాఁడాయెను. నవకుమారుఁడు మొదటిదినము ఉపవాసము, ఈ దినమును అనశనుఁడై యున్నందున ఆఁకలిబాధ మొదలయ్యెను. కుటీరమున నుండిన ఫలాదులు కడచినరాత్రియే తినియాయెను. ఇఁక అడవికిఁజని పండ్లనో కాయలనో తెచ్చుకొనకుండినయెడల ప్రాణముపోవును. ప్రొద్దుపోవకముందే ఫలాదు లేమేని తేవచ్చునని యెంచి నవకుమారుఁడు అడవికిఁ బోయెను.

నవకుమారుఁడు ఫలాన్వేషణపరాయణుఁడై సమీపముననున్న యిసుకగుట్టలపైనుండిన చెట్లలో నొకదాని పండ్లను కోసి తినిచూచెను. అవి బాదమువలె అతిరుచ్యములై యుండెను. కావున, ఆదినము ఆపండ్లను గోసి తిని క్షుత్తును నివారించుకొనియెను.

పైనిచెప్పిన యిసుకదిబ్బలు మిక్కిలిపొడవు కానందున శీఘ్రకాలముననే నవకుమారుఁడు వానిని దాఁటి నిబిడమగు వనమునకుఁ బోయెను. పరిచితిలేని వనంబున సంచరించుటకై

పోవువారు దారితప్పిపోయిన పథభ్రాంతి కావలసివచ్చునని యెంచుంగుదురు; మన నవకుమారునకు నట్లే సంభవించెను. గంభీరమగు జలకల్లోలశబ్దము వినవచ్చెను. అయ్యది సముద్ర తరంగఘోషమని తెలిసికొనియెను. ఎట్టెట్లో తిరిగి కొంతసేప టికి వనబాహ్యమును జేరి చూడఁగా సముద్ర మగపడియెను. బహువిస్తారంబగు నీలాంబుమండలంబునుగాంచి హృదయ మత్యుత్కటంబగు నానందప్రపూరిత మాయెను. వాలుకామ యంబగు తీరంబునకుఁ బోయి కూర్చుండెను. ఫేనిలమై నీలమై అనంతమైన సముద్రము! దృష్టి యెంతదూరము ప్రసరించునో అంతదూరము వఱకును తరంగభంగముచే గల్గిన ఫేనరేఖయే కన్పట్టుచుండెను. ఆధవళకాంతిగల ఫేనరేఖ వాయుప్రసారము వలన స్తూపాకారమై విమలమై కుసుమదామమువలె హేమ కాంతిగల సైకతమును జేరుచుండెను. ఆకాననమను కుంతలము ధరణి కుపయుక్తమైన అలకాభరణమై యొప్పుచుండె. నీలమైన జలమండలంబునం దచ్చటచ్చట ఫేనసహిత తరంగములు భంగ మగుచుండెను. ఏకాలముననైన ప్రచండవాయువు వీచి దాని వేగమువలన నక్షత్రమాలికలు స్థానచ్యుతమై గుంపులు గుంపు లుగా నీలాంబరంబునఁ దేలుచుండునేని, అపుడా సాగరతరంగ విక్షేపముయొక్క స్వరూపమునకు సమానమగును. ఈసమ యంబున అస్తగామినియైన దినమణి, మృదుల కిరణంబులచే నా నీలవర్ణమైన జలరాశిలో ద్రవీభూతమైన సువర్ణమువలె ప్రజ్వరిల్లుచుండెను. అతిదూరంబున నేదో యొక యూరోపి యను వర్తకుల సముద్రపోతము తెల్లనైన పక్షములను విస్తరిం

చుకొని వచ్చెడు నొక పెద్దపక్షివలె జలధియొక్క హృదయం బున పోవుచుండెను.

నవకుమారుఁ డెంతకాలము సముద్రతీరంబునఁ గూర్చుండి యనన్యమనస్కుఁడై జలధియొక్క శోభారాశిని జూచుచుండెనో యాకాలపరిమాణమును గ్రహింపనివాఁడై యుండెను. తుద కొక్కసారి ప్రదోషకాలతమము నీలజలముపైఁ బ్రసరించెను. అపుడు నవకుమారునకు చేతనమువచ్చినట్లు పర్ణకుటీరమునకుఁ బోవలయు ననెడియాలోచన కల్గి, నిట్టూర్పు పుచ్చి లేచెను. ఏల నిట్టూర్పు నిగుడించెనో దానిని మనము చెప్పలేము. అపు డాతనిమనంబున కేదైనను పూర్వసుఖము స్ఫురించెనేమో; దానిని యెవ రెఱుంగుదురు? లేచి వెనుక దిరిగెను. తిరిగిన తక్షణమే యొకయపూర్వమైన మూర్తి కన్నులకు మిఱుమిట్లు గొల్పెను. ఆ గంభీరధ్వనిగల సముద్రతీరంబున నా సైకత భూమియందు ఆ యస్పష్టమైన సంధ్యారాగంబున నిలువంబడియుండెను. అదియొక యపూర్వమగు రమణీమూర్తి! కేశభారమో—వేణిగా బద్ధము కాక సంసర్పితమై రాశీకృతమై ఆగుల్ఫలంబితమైన (Flowing down to the ankle) కేశభారము ఆకేశభారమునకు ముందుభాగమున సువర్ణసమాన సుందర శరీరము; చిత్రపటంబునందలి చిత్రము ప్రకాశించునట్లు మెఱయుచుండెను. ముంగురుల ప్రాచుర్యమువలన ముఖమండలము సంపూర్ణముగాఁ బ్రకాశించుచుండలేదు. అయినను మేఘవిచ్ఛేదమున వెలికిఁ జాఱివచ్చు చంద్రకిరణమువలె ప్రతీతియగుచుండెను. విశాలమైన లోచనంబులందు కటాక్షము అతిస్థిరముగను అతిస్నిగ్ధము

గను అతిగంభీరముగను అతిజ్యోతిర్మయంబుగను నుండెను. ఆ కటాక్షము సాగరహృదయంబునందు క్రీడాశీలమైన చంద్రకిరణ లేఖనమువలె స్నిగ్ధోజ్జ్వలమై ప్రకాశించుచుండెను. కేశరాశిచే స్కంధదేశంబును, బాహువులును గప్పఁబడియుండెను. విమలమైన బాహువుల కాంతి కొంచెము కొంచెము గనంబడుచుండెను. ఆ రమణీమణి దేహము శుద్ధముగను నిరాభరణముగను నుండెను. ఆ మూర్తియందుండిన యామోహినీశక్తిని వర్ణింప సాధ్యము కాదు. ఆ ముఖచంద్రబింబమునుండి వెలువడు కౌముదీవర్ణముయొక్కయు, ఘనకృష్ణవర్ణము గల చికురజాలముయొక్కయు సాన్నిధ్యంబువలనఁ గలిగిన యా కాంతి గంభీరనాదియగు సాగరకూలంబున సంధ్యారాగంబునం జూడకపోయినచో నామోహినీశక్తి మనస్సునకు అనుభూతము కాదు.

నవకుమారుఁడాసుందరిని దుర్గమమధ్యంబున నాకస్మికముగఁ జూచి నిశ్చేష్టితుఁడాయెను. వాని వాక్ఛక్తి నిలిచిపోయెను. ఆ రమణియు స్పందహీనయై అనిమిషలోచనయై విశాలమైన చక్షువులయొక్క స్థిరమైనదృష్టిని నవకుమారుని ముఖమండలమునం దుండి నిలుచుండెను. నవకుమారుని దృష్టియం దాశ్చర్యము చిప్పిలుచుండెను. రమణియొక్క దృష్టియం దాలక్షణము లేమియు లేక విశేషోద్వేగము ప్రకాశమగుచుండెను. పరస్పర మింతమాత్రమే ప్రభేద ముండెను.

అనంతరము ఆ విజనంబగు సముద్రతీరంబున నీ ప్రకారము పెద్ద ప్రొద్దిద్దరును పరస్పరము చూచుచుండిరి. తర్వాత

ఆతరుణీమణి అతిమృదుల స్వరముతో "పథికా! నీవు మార్గ మును తప్పితివా?" అనెను.

ఈ కంఠస్వరమునకుఁ దోడుగా నవకుమారుని హృదయ వీణెయు ధ్వనిసేయ నారంభించెను. విచిత్రమగు హృదయ యంత్రతంత్రం లేకముకాక లయవిహీనములై యుండెను. ఎంత ప్రయత్నించినను పరస్పరము సమ్మిళితములుకాలేదు. ఆ రమణి కంఠమునుండిపుట్టిన రమణీయమైన స్వరముతో నొక్కశబ్దము స్వరలయసమన్విత మగునేని యది మొదలుకొని సంసార యాత్రయు లయసమన్వితమైన సంగీతమువలె సుఖమయమగు నని నవకుమారుఁడు తలంచెను.

"పథికా! నీవు మార్గమును తప్పితివా?" అనుధ్వని మరల నవకుమారుని చెవులయందు ప్రవేశించెను. దీని కేమి యుత్తరము నీయవలయునో యది వాని మనస్సునకుఁ దోఁచ లేదు. ధ్వనిమాత్రము హర్షముచే కంపితమై సంచరింప నారం భించెను; వృక్షపత్త్రముల మర్మరితశబ్దము సాగరఘోష మందు మందీభూతమయ్యెను. సాగరమే వసనముగాఁ గల పృథివి యెట్లు మనోజ్ఞమైనదో, అట్లారమణియు మనోజ్ఞమై యుండెను. దాని ధ్వనియును మనోజ్ఞమే. కొంతసేపటికి వాని హృదయతంత్రులయందుండి సౌందర్యముయొక్క స్వరలయ సమన్వితమైన లహరి లేచెను.

ఆ రమణీమణి, యే ప్రత్యుత్తరమును రాకుండుటం గాంచి "రమ్ము" అని చెప్పి యటనుండి వెడలెను. ఆయమ పాదవిక్షేపములు గనఁబడలేదు. వసంతకాలమునందు మంద మారుతముచే సంచలితమైన శుభ్రమేఘమువలె మెల్ల మెల్లఁగ

కంటికి గోచరింపని పాదవిక్షేపముతో నడచెను. నవకుమారుఁడు జంత్రపుబొమ్మవలె నాయమ వెంటనడచెను. ఒకచోట పెక్కు వృక్షములుండెను. దానిలో ప్రవేశించిన తర్వాత నాసుందరి కనఁబడ లేదు. ఆ వృక్షములకు సమీపముననే యొకపర్ణకుటీర ముండెను.

## ఆఱవ ప్రకరణము

### కాపాలికునితోడ

"కథం నిగళసంయతాస్మిద్రుతం న యామి భవతీ మితః"

—రత్నావళి.

నవకుమారుఁడు కుటీరమునుఁ బ్రవేశించి తలుపుమూసి తలపై చేయునిడి తలవంచికొని కూర్చుండెను. చాలసేపు తల యెత్తి చూడలేదు.

ఇదేమి దేవియో—మానిసియో—లేకుండిన కాపాలికుని మాయామాత్రమో, యని నవకుమారుఁడు నిష్పందుఁడై మనస్సునం దాలోచింప నారంభించెను. ఏదియును స్థిరముగా గోచరింపలేదు.

అన్యమనస్కుఁడై యుండిన కారణంబున నవకుమారుఁడు దేనిని జూడలేదు. వాఁడచ్చటికి రాకముందే ఆ కుటీరమునం దొకప్రక్క కట్టెలు మండుచుండెను. రాత్రి చాల ప్రొద్దయినవెనుక సంధ్యావందనము చేయలేదని వాని స్మరణకు వచ్చెను. జలముఁదొరకదని తలంచెను. ఆ కుటీరమునందు కేవలము వెలుతురేగాక, పాకోపయోగములగు తండులాది

సామగ్రులు కొద్దిగ నుండెను. నవకుమారుఁడు వీనినంతయుఁ గాంచి యిది కాపాలికుఁ డుంచియుండునని భావించెను.

“సత్యంచ గృహమాగతమ్” అనుట కంటె, “భోజ్యం ఉదరాగతమ్” అని చెప్పినచో నింకను స్పష్ట మయ్యెడిని నవకుమారుఁ డీశబ్దముల మాహాత్మ్యమును దెలియనివాఁడు కాఁడు. పిమ్మట సాయంసంధ్యాదికృత్యంబులను దీర్చికొని కుటీరమునందున్న మృత్పాత్రలో వండికొని భుజించెను.

మఱునాఁ డుదయంబున చర్మశయ్యనుండి లేచి సముద్ర తీరాభిముఖుఁడై వెడలెను. నిన్నటిదినము సంచరించినవాఁడు గాన, నేఁడు కొంచెము కష్టముతో మార్గమును దెలిసికొని జలాశయ మున్నకడకుఁ జని ప్రాతఃకృత్యములను దీర్చికొని యచ్చో నిరీక్షించుచు నిలిచియుండెను. ఎవరిని నిరీక్షించుచు నిలుచుండెను? మొదటిరోజునఁ గాంచిన మాయావిని మరల నచ్చోటికి వచ్చుననెడి యాశ నవకుమారుని హృదయమున నెంత ప్రబలమై యుండెనో దానినిఁ జెప్పఁజాలము. అయినను, వాఁ డాస్థలమును విడిచి పోఁజాలనివాఁడై యుండెను. ఎంతసేపు వేచియుండినను అచ్చటి కెవ్వరును రాలేదు. అంతట వాఁ డచ్చట నాల్గుదిక్కులయందును సంచరింప నారంభించెను. వెదకి లాభము లేదు; ఇచ్చట మనుష్యసంచారముయొక్క గుర్తుకూడఁ గనఁబడలేదు. గుంచికొని మరల వచ్చి యదే స్థలమునఁ గూర్చుండెను. ఇంతలో సూర్యుఁ డస్తమించెను. చీఁకటి క్రమక్రమముగాఁ గ్రమ్ముకొన నారంభించెను. నవకుమారుఁడు హతాశుఁడై కుటీరంబును జేరెను. కాపాలికుఁడు కుటీరంబున నేలపైఁ గూర్చుండి యుండెను. నవకుమారుఁడు కుశల

ప్రశ్నము చేసెను. కాపాలికుఁడు ప్రత్యుత్తర మీయ లేదు
నవకుమారుఁడు:—ఇదివఱకు ప్రభువుల దర్శనమువలన నే

నేకారణముచే వంచితుండనై యున్నాఁడనో? ఎఱుఁగను.
కాపాలికుఁడు:—స్వవ్రతంబున నియుక్తుఁడనై యున్నాఁడను.

నవకుమారుఁడు, స్వగ్రామంబునకుఁ బోవలయు ననెడి అభిలాషను వ్యక్తపఱచి, "మార్గము తెలియదు; పాథేయమును లేదు; దీనికి విధానము ప్రభువుల దర్శనమైనచోఁ దెలియు ననెడి నమ్మకముగలవాఁడనై యున్నాఁడను" అనియెను.

కాపాలికుఁడు, 'నాతోడరమ్ము' అని చెప్పి, యటనుండి లేచెను. ఊరి కేఁగుట కేదేని యుపాయము గలుగుననెడి యాశతో నవకుమారుఁడు వానివెంటఁ జనెను.

అపు డింకను సంధ్యారాగము అంతర్హితమై యుండ లేదు. కాపాలికుఁడు ముందుగాఁ జనుచుండెను నవకుమారుఁడు వానివెంటఁ బోవుచుండెను. అకస్మాత్తుగా నవకుమారుని వీపుపై నెవరిదో యొక కోమలమైన కరస్పర్శ మాయెను. వెనుక తిరిగి యావ్యక్తినింగని నిష్పందుఁ డాయెను. ఆవ్యక్తి ఆగుల్ఫవిలంబితమైన నిబిడకేశరాశిధారిణియైన అరణ్యదేవీ మూర్తి! పూర్వమువలె నిశ్శబ్దము; నిష్పందము! ఎచ్చటనుండి యీమూర్తి యాకస్మికముగ వానివెనుక వచ్చినది? నవకుమారుఁడు చూడఁగా నారమణి నోటిపై చూపుడు వ్రేలుంచి కొని యుండెను. దానివలన, నాయమ మాటలాడవల దను చున్నదని గ్రహించెను. అయినను వాఁ డేవిషయమును గూర్చి మాటలాడుటకు నెంచియుండెను? వాఁ డబ్బురమొంది యచ్చటనే నిల్చెను. కాపాలికుఁడు దీనినంతయుఁ జూడలేదు. ముందు

నడచుచుండెను. కాపాలికుఁడు శ్రవణాతిక్రాంతుఁడైన పిమ్మట వానికి వినకుండునట్లు ఆరమణీమణి నవకుమారుని చెవిలో "ఎచ్చటికిఁ బోయెదవు? పోవలదు—వెనుక దిరిగిపొమ్ము—పాఱిపొమ్ము"—అనిచెప్పెను.

ఇట్లుచెప్పి యాసుందరి త్వరగా వెడలిపోయెను. నవకుమారుఁడు కొంతసేపు ఖిన్నమానసుఁడై యచ్చటనే నిలిచెను. వెనుక దిరుగ నిశ్చయించెను. అయినను ఆ నారీమణి యేదిక్కున బోయెనో తెలియలేదు. వాఁడు మనస్సునం "ఇది యెవరి మాయయో? లేకున్న మతిభ్రమమో? నేను విన్నది భయ సూచకమైన మాటగా నున్నది. అయిన నెవరికి భయము? తాంత్రికుఁ డేమికావలసినను జేయఁగలఁడు. అటులైన పరుగిడి పోదునా? మార్గమెయ్యది?" యని యిట్లు మనంబునఁ బరిపరి విధములుగా నాలోచించుచుండెను.

నవకుమారుఁ డిట్లాలోచించుచుండఁగా, కాపాలికుఁడు వెంటరాలేదని తెలిసికొని మరలి వచ్చుచుండెను. వచ్చి "సావకాశ మేమి?" యనెను.

ఏకార్యమును స్థిరపఱచికొనఁజాలనివారు, మొదట నేదిక్కున కీడ్చిన నాదిక్కునకుఁ బోవ నుద్యుక్తు లగుచుందురు. కాపాలికుఁడు, మరలఁ బిలువఁగనే నవకుమారుఁడు మాటాడక వానివెంటఁ జనెను.

కొంచెము దూర మరుగఁగనే యెదుట, చుట్టును మట్టి గోడలుంచి కట్టఁబడిన కుటీరము కానఁబడియెను. దానిని కుటీరమనిగాని, లేక, యొక చిన్నయిల్లనిగాని చెప్పఁదగును అయినను, దాని వివరణము మనకేమియుఁ బ్రయోజనము

లేదు. దీని కావలనే సికతామయం బగుసముద్రతీరము. గృహ పార్శ్వమునుండి కాపాలికుఁడు నవకుమారుని యా యిసుక గలప్రదేశంబునకుఁ దోడ్కొనిపోయెను. ఈసమయంబుననే ధనుస్సునుండి విడువఁబడిన బాణవేగమువలె మొదటఁ గనఁబడిన సుందరీమణి నవకుమారుని పార్శ్వమునుండి పరుగిడిపోయెను. అట్లు పోవుచు వానిచెవిలో "నిప్పుడైనను దప్పించుకొని పొమ్ము; నరమాంసములేక తాంత్రికులపూజ జరుగదు. నీకుఁ దెలియదా?" అనిచెప్పి పరువిడి పోయెను.

నవకుమారుని ముఖంబునందు ఊటనుండి జలము ప్రవహించునట్లు చెమట జలము ప్రవహింప నారంభించెను. దుర దృష్టంబునకు సరిగా యువతి చెప్పినమాటలును కాపాలికుని చెవింబడెను. వాఁడు "కపాలకుండలా!" అని గర్జించెను.

ఆ స్వరము నవకుమారుని చెవులకు మేఘగర్జనమువలె వినంబడెను. అయినను కపాలకుండల యేమియు నుత్తర మీయ లేదు.

కాపాలికుఁడు నవకుమారుని చేయినిపట్టుకొని పోవం దొడంగెను. మనుజఘాతుకుని కరస్పర్శమువలన నవకుమారుని రక్తము నరములయందు మునుపటికంటె నూఱుపాళ్లెక్కువ వేగంబునఁ బ్రవహింప నారంభించెను. లుప్తమైయున్న సాహసము మరలఁ గలిగి; చేయివిడువు మని చెప్పెను.

కాపాలికుఁ డుత్తర మీయలేదు. నవకుమారుఁడు మరల "న న్నెక్కడికి పిలుచుకొనిపోయెద" వని యడిగెను.

కాపాలికుఁడు——పూజాస్థానంబునకు.

నవకుమారుఁడు—ఏల ?

కాపాలికుఁడు—యథార్థమై.

నవకుమారుఁడు వాని పిడికిలినుండి తనచేతిని చాలబలముతో నతితీవ్ర వేగమున నీడ్చెను. ఇట్లు వాఁడీడ్చిన బలమునకు వేఱొకఁడైనచో చేయియూడిపోయియుండును. మఱియు ఆ వేగంబునకు నేలంగూలును. కాపాలికునియొడలు కొంచెమేనియు కదలనే లేదు. వాఁడు నవకుమారునిచేయి పట్టువదలలేదు. వాని హస్తముయొక్క అస్థిగ్రంథికూడ కీలుతప్పినట్టు లాయెను. నవకుమారుఁడు ముమూర్షువువలె కాపాలికునివెంట నరిగెను.

ఇసుకదిబ్బయొక్క మధ్యస్థానమునకుఁ బోయిచూడఁగా మొదటిదినమువలె పెద్దపెద్ద దూలములవంటి కట్టెలరాసియం దగ్ని ప్రజ్వలించుచుండెను. దాని నలుప్రక్కలందును తాంత్రికుఁడు పూజాద్రవ్యంబులను సిద్ధపఱిచియుంచి యుండెను. వానియం దొకనరకపాలంబున ఆసవము (Spirit distilled from Sugar, flowers &c.) నింపియుండెను. అయినను, శవము సిద్ధముగా నుండలేదు. నవకుమారుఁడు తానే శవముగా నేర్పడవలసియుండు నని యూహించుకొనెను.

అచ్చట ఎండినవియు, కఠినములైనవియు నగుతీఁగెలు కొన్ని పడియుండెను. కాపాలికుఁ డాతీఁగెలతో నవకుమారుని గట్టెను. అపుడు నవకుమారుఁడు కొంచెము బలమును గనఁబఱచెను. దానిచే ఫలమేమియు గలుగలేదు. కాపాలికునకు ఆముసలితనమందును ఏనుఁగంత బలముండినదని నవకుమారునికిఁ దెలియవచ్చెను.

నవకుమారుఁడు తనబలమును జూపినందున, కాపాలి కుఁడు, "మూర్ఖుఁడా! నీబలమునుఁజూపనేల? నీజన్మ మీదినము సార్థకమాయెను. భైరవిపూజకు నీ మాంస మర్పిత మగుచున్నది. దీనికంటె నీవంటివారికి మఱేమి సౌభాగ్యము కావలయును!" అని చెప్పెను.

కాపాలికుఁడు నవకుమారుని దృఢముగాఁ గట్టి యిసుకపై దొర్లించెను. వాఁడు వధకు పూర్వ మాచరింపవలసిన పూజ చేయందొడంగెను.

ఎండినతీఁగెలు అతికఠినము లైనవి. బంధన మతి దృఢమైనది. మృత్యు వాసన్నమైయున్నది. నవకుమారుఁ డిష్ట దేవతాచరణంబులందు మనస్సు నుంచెను. ఒక్కసారి తన జన్మభూమి జ్ఞాపకంబునకు వచ్చెను. ఒకప్పుడు బహుకాలంబునకు ముందు గతించిన జననీజనకులు జ్ఞాపకమునకురాఁగా కన్నుల నుండి నీరుకాఱెను. కాపాలికుఁడు వధకు పూర్వము చేయవలసిన పూజలన్నియు చేసి ముగించి ఖడ్గమునుఁ దెచ్చుటకై యాసనమునుండి లేచెను. లేచిపోయిచూడఁగా ఖడ్గము కనఁబడలేదు. ఆశ్చర్యము! కాపాలికుఁడు విస్మితుఁ డాయెను. వాఁడు, అపరాహ్ణము ఖడ్గమును దెచ్చియుంచిన చోటు తప్ప, మఱెచ్చట నుంచలేదని దృఢనిశ్చయము గలవాఁడాయెను. ఇపుడు ఖడ్గమేమాయెను? వాఁడు వెదకిచూచెను. ఎచ్చటను దొరకలేదు. అంత వాఁడు మున్ను జెప్పిన చిన్నయింటి దిక్కుమొగమై కపాలకుండలను బిలిచెను. ఎన్నిమారులు పిలిచినప్పటికిని బదులు లేదు. అంత కాపాలికుని కన్నులగ్నికణములవలె నెఱ్ఱనై బొమలు ముడివడియెను. కాపాలికుఁ

డెచ్చుటికో పరువిడెను. ఈయవకాశకాలమున నవకుమారుఁడు బంధనమును విడిపించుకొనుటకై బహువిధములుగాఁ బ్రయత్నించెను; గాని యది నిష్ఫలమాయెను.

ఈ సమయంబునందు ఇసుకలో నతిమృదువగు పదధ్వని వినవచ్చెను. నవకుమారుఁడు దృష్టిని నిగిడించిచూచెను. చూడఁగా మోహినిర్గయైన కపాలకుండల! ఆయమ చేతియందు ఖడ్గ ముండెను.

కపాలకుండల, "యూరకుండుము! మాటలాడవలదు; ఖడ్గము నా చేత నున్నయది; దొంగిలించి పెట్టియున్నాను."

ఇట్లనిచెప్పి కపాలకుండల యతిశీఘ్రముగా నవకుమారుని లతాబంధనము నాఖడ్గముతో ఖండించి నిమిషములో విడుదలచేసెను. విడిపించి, 'పలాయన పరాయణుఁడవు కమ్ము; నా వెంటపరుగిడి రమ్ము; త్రోవఁ జూపెద" ననియెను.

ఇట్లు చెప్పుచు బాణవేగముతో దారిజూపుచుఁ బోయెను. నవకుమారుఁడు ననుసరించి పరుగిడుచు పోయెను.

## ఏడవప్రకరణము

అన్వేషణము

"And the Great lord of luna
Fell fat that deadly Stroke;
As falls on Mount Alvernus
A thunder-smitten oak."

—*Lays of Ancient Rome.*

ఇచట కాపాలికుఁడు గృహమందును, ఇతరస్థలములందును వెదుకగా ఖడ్గముగాని కపాలకుండలగాని కనఁబడలేదు.

వాఁ డనుమానమొంది యిసుకదిబ్బకు వచ్చి చూడఁగా నవ కుమారుఁడును లేఁడు. వాఁడు అత్యంతాశ్చర్యము నొందెను. మఱికొంతసేపటికి ఖండింపఁబడిన లతాబంధనముపై దృష్టి సోఁకెను. అపుడు స్వరూపానుభవము గలిగి కాపాలికుఁడు నవ కుమారుని యన్వేషించుటకై పరుగిడెను. అయినను విజన మగు నరణ్యంబునఁ బాఱిపోయినవాఁ డిట్టిదిక్కునఁ బోయె నని యెఱుంగుట దుస్సాధ్యము. అంధకారమైనందున నెవ్వ రును కంటపడలేదు. కావున, మాటలధ్వని వినుటకై కొంచెము సేపు అట్టిట్టు తిరిగి చూచెను. నలుపైపులయందును ఎంత సేపటికిని చప్పుడు వినఁబడలేదు. చక్కఁగాఁ జూతమని యిసుక గుట్ట నెక్కెను. కాపాలికుఁ డొకపార్శ్వమునుండి యెక్కెను. మఱొక పార్శ్వమునం దాగుట్టయొక్క క్రిందిభాగము వానచే కరిగిపోయి యుండుటను వాఁ డెఱుంగఁడు. శిఖరముపై కెక్కఁగనే వానిశరీరభారముచే పతనోన్ముఖమై యున్న స్తూప శిఖరము భగ్నమై యతి ఘోరశబ్దముతో నేలంబడెను. పతన కాలంబున పర్వతశిఖరమునుండి కాలుజాఱిపడెడి మహిషము వలె కాపాలికుఁడు కూడ దానితోడ పడిపోయెను.

---

# ఎనిమిదవ ప్రకరణము

## ఆ శ్ర య ము

"And that very night—
Shall Romeo bear thee to Mantua."

— *Romeo and Juliet.*

ఆ యమావాస్యయొక్క గాఢాంధకారమైన రాత్రికాలం వారిరువురు సూర్ధ్వశ్వాసముతో నరణ్యమధ్యంబును బ్రవే

శించిరి. వనమార్గము నవకుమారునకు అపరిచితమైనది. ఆ సహచారిణి యగు షోడశవర్షవయోవిలాసిని పోవుమార్గము ననుసరించుటదప్ప వానికి వేఱే యుపాయము లేదు. అయినను, అంధకారంబున నారమణిని అనుగమించుటకు వలనుపడలేదు. కావున, ఆ రమణి తనచెఱఁగును బట్టికొమ్మనియెను. నవకుమారుఁ డట్లు చేసెను. అంధకారంబున నేమియుఁ గనుపడదు. ఆకసమునందొక్కొక్కచోట నక్షత్రముల వెలుఁగు. శుభ్రమైన యిసుకదిబ్బల శిఖరములు మాత్రము అస్పష్టముగాఁ గానంబడుచుండెను. ఒక్కొకచోట మిణుఁగురుపురుగులచే నిండిన వృక్షంబులు చక్షుర్గోచరమగుచుండెను.

కపాలకుండల పథికునిఁ బిలుచుకొని నిభృతమగు నరణ్యమును బ్రవేశించెను. రాత్రి రెండుజాములై యుండెను. ఆ వనమధ్యమునం దొక అత్యుచ్చమగు దేవాలయ గోపురమును, దానిసమీపమున ఇటుకలతోఁ గట్టఁబడిన నొక యిల్లును కనఁబడెను. కపాలకుండల ఆయింటిగడపనెక్కి తలుపుతట్టెను. చాలసేపుదాఁక తట్టగా తట్టగా లోపలనుండి యొక వ్యక్తి "ఎవరు? కపాలకుండలా!" అనఁగా, కపాలకుండల "తలుపుదీయు" మనెను.

వెంటనే తలుపు తెఱువంబడియెను. తలుపు తెఱచిన వ్యక్తి దేవాలయాధిష్ఠాత్రియగు దేవీ సేవకురాలు; అనఁగా అధికారిణి. ఆవ్యక్తి యేఁబదేండ్లవృద్ధస్త్రీ, కపాలకుండల యప్పుడాముసలిదాని విరళమగు కేశములుగల తలను చేతి— తననోటియొద్దకు వంచికొని చెవిలో రహస్యముగా తన

నవాని యవస్థను దెలిపెను. అధికారిణి పెద్దప్రొద్దక్ష్లే కరతల లగ్న శీర్షురాలై యాలోచించి, తుద కిది బహుకష్టమైనపని; మహాపురుషుఁడు ఇష్టమువచ్చినచో నేమిర్గైనం జేయనోపును? ఏమైననుగాని, దేవీ ప్రసాదంబువలన "నీకు అమంగళము కాకుండుగాత" మని చెప్పి, అమనుష్యుఁ డేడ ? యని యడిగెను.

కపాలకుండల "రమ్ము" అని పిలిచెను. మఱుఁగున నిలిచి యుండిన నవకుమారుఁడు పిలువఁగనే యింటిలోనికిఁ బోయెను. అధికారిణి వానింజూచి "యీదిన మిచ్చట దాఁగికొని యుండుము; తెల్లవాఱు ప్రొద్దుననే నిన్ను మేదినీపురమార్గమున విడిచివచ్చెద" ననెను.

అధికారిణి వానిమాటలవలన వాని కాహారములేదని దెలిసికొని వంటచేయఁ బ్రయత్నింపఁగా, నవకుమారుఁడు ఖండితముగా వలదని చెప్పి, పరుండుటకు స్థలము జూపిన చాలు ననెను. అధికారిణి, తనవంటయింటియందే పరుండమని చెప్పెను. నవకుమారుఁడు పరుండెను. పిమ్మట కపాలకుండల యావృద్ధస్త్రీతో నేను సముద్రతీరంబునకు పోయెద" ననియెను. అధికారిణి స్నేహాంతఃకరణమున నాయమతో "పోవలదు; కొంచెమాగుము; నిన్ను వేఁడఁగల దొకటియున్నది" అనెను.

కపాలకుండల—ఏమది?

అధికారిణి:—నిన్నుఁ జూచినది మొదలు నీయెడ నాకు జాలిగానున్నది. దేవునియాన ఈ మందిరమున నుండు మహామాతకన్న నిన్నెక్కుడుగా ప్రేమించుచున్నాను. నేను చెప్పెడి

దానిని నీవు వినవలయును; ఈ యొక్కమాట వినుము.
దానిని నవ్వులాటయని యెన్నకుము.
కపాలకుండల:—వినియెద, చెప్పుము.
అధికారిణి:—నాప్రార్థన యేమనఁగా నీవు మరల అక్కడికి పోఁగూడదు. ఇదియే నాప్రార్థన.
కపాలకుండల:—అదేల ?
అధికారిణి:—పోయినచో నీవు బ్రదుకవు.
కపాలకుండల:—అది నాకును దెలియును.
అధికారిణి:—తెలిసియు నడుగనేల ?
కపాలకుండల:—అచటికి పోక యెచటి కేఁగు మనెదవు ?
అధికారిణి:—ఈ పథికునితోఁ గూడి దేశాంతరమునకుఁ బొమ్ము.

కపాలకుండల నిశ్చేష్టితురాలై యుండెను. అధికారిణి, "అమ్మా! దేనినిగూర్చి చింతించుచున్నావు" అనియెను.

కపాలకుండల:—నీ శిష్యుఁడు వచ్చియున్నపుడు యువతు లిట్టి యౌవనపురుషులతోఁగూడఁ బోవుట యనుచితమని చెప్పియుంటివి. ఇపుడు పొమ్మని యెట్లు చెప్పెదవు ?
అధికారిణి:—అపుడు నీప్రాణమునకు భయములేదు. అపు డేయుపాయంబునకు మార్గము లేదో, యిపు డాయుపాయంబునకు మార్గమున్నది. రమ్ము, మహామాతయొక్క యాజ్ఞనొంది వత్తమనియెను.

ఇట్లని చెప్పి యధికారిణి దీపము నెత్తికొని దేవాలయంబునకుఁ బోయి తలుపును దీసెను. కపాలకుండల యామె వెంటఁ బోయెను. మందిరమధ్యంబున నొకపురుషప్రమాణము

కంటె గొప్పదగు కరాళకాళికామూర్తి ప్రతిష్ఠితమై యుండెను. ఇర్వురును భక్తిభావంబులతోఁ బ్రణామము లొనర్చిరి. అధికారిణి ఆచమనముచేసి, పుష్పపాత్రమునుండి యొకబిల్వదళము నెత్తి పాదముపైనిడి చేతులు జోడించుకొని నిలుచుండెను. కొంచెముసేపటికి యధికారిణి కపాలకుండలను గూర్చి "తల్లీ! చూడుము; దేవి యర్ఘ్యమును గ్రహించినందువలన సర్వము మంగళమగును. నీ వీ పథికునివెంట స్వచ్ఛందచిత్తురాలవై పొమ్ము. అయినను, నేను విషయాసక్తులగు జనులస్థితి నెఱుంగుదును. నీవు గళగ్రహురాలవై వీనివెంటఁ బోయినచో నతఁడపరిచితురాలవగు నిన్నుఁబిలిచికొనిపోయి పరులవలన అపహాసమొందును. నిన్నునులోకులు తిరస్కరింతురు. నీవు ఇతఁడు బ్రాహ్మణుఁడని చెప్పితివి. నేనుకూడ వానిజందెమును జూచితిని; వీఁడు నిన్ను వివాహమాడి వెంటఁ బిలుచుకొని పోయినచో సకలమును మంగళ మగును. లేకున్నచో నేను వీనివెంటఁ బొమ్మని నీతోఁ జెప్పఁజాల" ననెను.

"వి-వా-హ !" ఈమాటలను కపాలకుండల యతిశీఘ్రముతో నొక్కొక్క యక్షరముగా నుచ్చరించెను. పిదప "వివాహ మనునొడిమాటను నీనోటనుండి వింటిని. అట్లనఁగా నేమి? అది తెలియదు. దానికేమిచేయవలయు" నని యడిగెను.

అధికారిణి కొంచెమునవ్వి, "వివాహము స్త్రీలకు ధర్మాచరణంబున కొక సోపానము వంటిది. ఇందువలననే స్త్రీలను సహధర్మిణులని చెప్పెదరు. జగన్మాతనై తము శివునికి వివాహితురాలు" అని చెప్పెను.

అధికారిణి వివాహసంగతుల నంతయు కపాలకుండల దెలిసికొన్నది యని యెంచికొనెను. కపాలకుండలయుఁ దెలిసికొనినట్లు భావించికొని "అట్లే కానిమ్ము. అయినను, కాపాలికుని విడిచి పోవుటకు మనసు రాలేదు. వాఁడు న న్నిన్నిదినములు కాపాడియున్నాఁడుగదా?" యనెను.

అధికారిణి:—"ఎందుకొఱకు వాఁడు నిన్నుఁగాపాడెనో, దానిని నీవెఱుంగవు; స్త్రీలసతీత్వమును జెఱుపకున్నచో తాంత్రికునికి మంత్రసిద్ధి యగుటలేదు. అది నీ వెఱుంగవు. నేను తంత్రగ్రంథములను జదివియున్నాను. తల్లియగు జగదంబ జగత్తునకు మాత. ఆయమ సతులకు సతీత్వస్వరూపిణి. సతులందు శ్రేష్ఠురాలు. వీఁడు సతీత్వనాశసంబంధమై చేసెడు పూజ యాదేవి యెప్పటికిని గ్రహింపదు. అందుకొఱకే నే నామహాపురుషునియభిమతంబునకు విరోధముగా నాచరించెదను. నీపలాయనమునకు నే నెన్నఁటికిని కృతఘ్నురాలను గాను. కేవల మిదివఱకును సిద్ధిసమయము రానందున నీవు మిగిలియున్నావు. నీ వీదినము జేసిన కార్యంబుచేత ప్రాణంబున కపాయమై యున్నది గాన, నీవుపాఱిపోవలసినదని చెప్పుచున్నాను. సాక్షాత్ భవానీదేవి యనుజ్ఞ యొసంగినది. కావునఁ బొమ్ము. నిన్ను ఇక్కడ నుంచుకొనుటకు సాధ్య ముండినచో నట్లు చేయుదును. అట్టి నమ్మకము లేదనుటను నీ వెఱుంగుదువు కదా."

కపాలకుండల:—"వివాహము కానిమ్ము."

ఈవిధముగా మాటలుజరిగినపిదప నిద్దరును మందిరము నుండి బయటికి వచ్చిరి. అధికారిణి, కపాలకుండలను నొక్కగది

యందు కూర్చుండఁబెట్టి నవకుమారుఁడు పరుండినచోటికి కేఁగి వానితలదగ్గఱ కూర్చుండి, "అయ్యా! నిద్రపోవుచున్నావా యేమి?" యని యడిగెను.

నవకుమారుఁడు నిద్రావస్థయందుండలేదు. తనదేశంబునుగూర్చి యాలోచించుచుండెను. ఈయమ ప్రశ్నను విని, "లేదమ్మా!" యనెను.

అధికారిణి:—నీపరిచయము నెఱుంగుటకై వచ్చితిని. నీవు బ్రాహ్మణుఁడవే కదా?

నవకుమారుఁడు:—ఔను.

అధికారిణి:—ఏ తెగలోని బ్రాహ్మణుఁడవు?

నవకుమారుఁడు:—రాఢీ తెగవాఁడను.

అధికారిణి:—మేమును రాఢీయశ్రేణివారమే, ఉత్కలరాఢీవారము కాము. మేము వంశమున కులాచార్యులము. ఇపుడు జగదంబికపాదాశ్రయులమై యున్నారము. నీపేరేమి?

నవకుమారుఁడు:—నవకుమారశర్మ యనెదరు.

అధికారిణి:—నీ వాసస్థాన మేది?

నవకుమారుఁడు:—సప్తగ్రామము.

అధికారిణి:—ఏసంఘమునఁ జేరినవారు?

నవకుమారుఁడు:—వంద్యాఘాటి.

అధికారిణి:—భార్య లెందరు?

నవకుమారుఁడు:—ఒక్క భార్యయే.

నవకుమారుఁడు సంసారవిచారమునం దన్ని సంగతులను విశదముగాఁ జెప్పలేదు. ప్రకృతమున వానికి ఆభార్యయును

లేదు. వాఁడు రామగోవిందఘోషాలుని కూఁతురగు పద్మావతిని వివాహముచేసికొని యుండెను. వాని పదుమూఁడవ యేఁట నతనిమామ సపరివారముగా పురుషోత్తమయాత్రకుఁ బోయియుండెను. ఆసమయంబున పఠానులు అక్బరు పాదుషా వలన వంగదేశమునుండి తఱుమఁగొట్టఁబడినవారై ఉత్కల (Orissa) దేశమున దళబద్ధులై వచ్చి నివాసమేర్పఱుచుకొనిరి. వారిని నాశముచేయుటకై పాదుషా యాజ్ఞ మేరకు ప్రయత్నములు జరుగుచుండెను. రామగోవిందఘోషాలుఁడు యాత్ర చేసికొని యుత్కలమునుండి మరలి వచ్చుచుండఁగా, మొగలులకును పఠానులకును యుద్ధ మారంభ మగుచుండెను. కావున నతఁడు వచ్చుచున్నపుడు దారిలో పఠానులచేతఁ జిక్కెను. పఠానులాకాలంబున వివేకావివేకవిచారశూన్యులై యుండిరి. వారు నిరపరాధులగు ప్రయాణీకులపై ధనార్థులై అత్యాచారంబుల నడుపుటకై ప్రయత్నపడుచుండిరి. రామఘోషాలుఁడు కొంచెము ఉగ్రస్వభావముగలవాఁడు. పఠానులనుగుఱించి కటూక్తులం బల్కెను. ఇందులకు ఫలంబుగా నతఁడు సపరివారముగఁ బట్టువడి తుదకు జాతిభ్రష్టుఁడై ముసల్మానుఁడు కావలసి వచ్చెను.

పిమ్మట ప్రాణముతో సపరివారముగా నూరుచేరెను. అయినను, ముసల్మానుఁడని యాత్మీయులందఱును బహిష్కారము చేసి శుద్ధముగాఁ త్యజించిరి. అపుడు నవకుమారుని జనకుఁడు అతనిని జాతిభ్రష్టునిగాఁ దెలిసి యాపరివారంబునఁ జేరిన తన కోడలినిం ద్యజించెను. నవకుమారుఁడు తనభార్యను జూడలేదు.

స్వజనులచేఁ ద్యజింపఁబడి సమాజచ్యుతుఁడైన రామఘోషాలుఁడు చాలదినములు స్వదేశమున నివసించుటకు వలనుపడ లేదు. ఈకారణమేగాక, రాజదర్బారునందు గొప్పయుద్యోగమును సంపాదింపవలయు ననెడి యాశచే నతఁడు సపరివారంబుగా గ్రామమునువిడిచి రాజధానియగు రాజమహాలునకుఁ బోయి, యచ్చట వాసము చేయుచుండెను. జాత్యంతరమును గ్రహించి సపరివారముగా నందఱును మహమ్మదీయనామంబులను ధరించిరి. పిదప వారిస్థితిగతుల నెఱుంగుటకు నవకుమారునికి వలనుపడదయ్యె. నవకుమారుఁడు వైరాగ్యముచే మరల వివాహము చేసికొనలేదు. అందుచే నతనికి భార్యయే లేదని చెప్పవలసి వచ్చెను,

అధికారిణి కీవృత్తాంతము తెలియదు. ఆయమ మనస్సున కులీనుల కిద్దరుభార్యలుండుట కాక్షేపణలేదని తలంచి, ప్రకాశముగా, "నీ నొక్కమాట యడుగవలయునని వచ్చితిని, ఇప్పుడు పరప్రాణరక్షణముజేసిన కన్యక పరహితార్థమై స్వప్రాణమును బోఁగొట్టుకొన్నదై యున్నది. ఆమె యేమహాపురుషుని యాశ్రయమునందు వాసముచేయునో వాఁడతిభీకరస్వభావము గలవాఁడు. ఆయమ వానిచెంతకు పోయినచో నీకేదశ గల్గెనో యాదశ యామెకుఁ గల్గును. దీని క్షేమైన నుపాయమును ఆలోచించి చెప్పుదువా యని యడుగుటకై వచ్చితి" ననియెను.

నవకుమారుఁడు లేచి కూర్చుండెను. కూర్చుండి "నేను నదే యాలోచన చేయుచున్నాను. నీవు సకలవిషయంబుల నెఱింగినదానవై యున్నావు నీవే యేదేని యుపాయము చేయ

వలయును. నాకుఁ బ్రాణదానమొసంగినవానికి నావలన నేమైనఁ బ్రత్యుపకారము కావలసియుండినయెడల, నేను దానిని జేయుటకు సిద్ధముగ నున్నాఁడను. ఇపుడు నేను ఆలోచించు చుండఁగా నేనే ఆనరఘాతుకునిచెంత కేఁగి యాత్మసమర్పణము చేసికొనినచో నీయువతి ప్రాణరక్షణ మగునని తలంచు చున్నాఁడ" ననెను. అధికారిణి చిఱునవ్వునవ్వి, "నీవు పిచ్చివాఁడవు! దీనిచే ఫలమేమి? నీప్రాణము పోవుటయేగాని యామహాపురుషునకు ఈమెయందుగల కోపము ఉపశమనము కాదు. దీని కొక్కటే యుపాయము కల"దని చెప్పెను.

నవకుమారుఁడు:—అదేమి యుపాయము?

అధికారిణి:—ఈయమ నీతోఁ బాఱిపోవు టొక్కటే యుపాయము. అయినను, అది దుర్ఘటమైనది. ఇచ్చట నాయొద్దనుండినచో నొకటి రెండుదినములలో చిక్కువడుట తథ్యము. దేవాలయమున కామహాపురుషుఁడు వచ్చుచు పోవుచు నున్నాఁడు. కావున నిచ్చటనుండిన కపాలకుండలకు అశుభమేగాని వేఱులేదు.

నవకుమారుఁడు కేవల కుతూహలముతో, "నా వెంటఁ బాఱిపోవుట దుర్ఘటమాయేమి?" అని యడిగెను.

అధికారిణి:—ఈమె యెవ్వరికన్య; ఏకులమునఁ బుట్టినది; ఇవి యేదియు నీకుఁ దెలియదు. ఎవరి సతి; ఎట్టి నడత గలది; అదియును దెలియదు. ఇట్టిదానిని నీ వెట్లు పిలిచికొని పోఁగలవు? పిలిచికొనిపోయినను నీస్వగృహంబునం దుంచు కొందువా? అట్లు కానిచో నీయనాథస్త్రీ గతియేమి?

నవకుమారుఁడు కొంచె మాలోచించి, "నాప్రాణమును సంరక్షించినదానికొఱకై చేయవలసిన పని యేదైనను సరియే నాకసాధ్యము కాదు. ఈమె నాసొంతపరివారముతోఁ జేరిన దానివలె నుండు" ననెను.

అధికారిణి:—మంచిది; అయినను నీపరివారమువారు ఈమె యెవరు? ఎవరిభార్య? అని యడిగినచో నేమని యుత్తర మిత్తువు ?

నవకుమారుఁడు ఆలోచనలో మునిఁగి, "నీవు ఈమె పరిచయమునంతయుఁ జెప్పుము; నే నదేప్రకార మడిగినవారి కందఱకును చెప్పెద" ననెను.

అధికారిణి:—మంచిది, మీారు యువయువతులు మార్గమునందు అనన్యసహాయులై యెట్లు పోఁగలరు ? జనులు చూచి యడిగిన నేమని చెప్పుదురు ? నీ స్వజనులతో నేమని చెప్పుదువు? నే నీకన్యకను జగదంబవలె భావించియున్నాను. నేను ఈమెచరిత్రము తెలియని యౌవనవంతునివెంట నెట్లు బంపనగును ?

నవకుమారుఁడు:—నీవును మావెంబడి రమ్ము.

అధికారిణి:—నేను రానగునా? భవానిపూజ చేయువారెవరు ?

నవకుమారుఁడు స్తబ్ధుఁడై; "అటులేని వేఱేయుపాయమును జేయలేవా?" యనెను.

అధికారిణి:—ఒక యుపాయముమాత్ర మున్నది. అది నీ యౌదార్యమును అపేక్షించుచున్నది.

నవకుమారుఁడు:—అదేమి? నేను చేయనంటినా? యేమి యుపాయము? చెప్పుము.

అధికారిణి:—వినుము. ఈమె బ్రాహ్మణకన్యక. బాల్యముననే దుర్దాంతులగు క్రైస్తవదొంగలవలన నపహృతయై ఓడ పగిలిపోయినందున వారీమెను సముద్రతీరమున విడిచిపెట్టిపోయిరి. సకలవృత్తాంతములను తుదకదియే చెప్పును. ఈమె కాపాలికునికిఁ జిక్కినది. వాఁడుతన యోగసిద్ధికొఱకు దీనిని బాలించుచున్నాఁడు. వాఁడు కొలఁదిదినములలోనే స్వప్రయోజనసిద్ధినిఁ బొందఁగలఁడు. దీని కింకను వివాహము కాలేదు. దీని చరిత్రము పరమపవిత్రమైనది. నీవు దీనిని వివాహముచేసికొని నీయింటికిఁ బిలిచికొని పోవలయును. అప్పుడెవరు నేమియుననఁజాలరు. నేను యథాశాస్త్రముగా కన్యాదానముచేసి యిచ్చెదను.

నవకుమారుఁడు లేచి అట్టిట్టు తిరుగుచుండెను. ఏమియుత్తరము నీయలేదు. అధికారిణి "నీవు పరుండి నిద్రపొమ్ము. తెల్లవాఱె త్వరగా లేపెదను. ఇష్టమున్నయెడల నీవొక్కఁడవే పొమ్ము. నిన్ను మేదినీపురమార్గమున విడిచి వచ్చెద" ననెను.

ఇంతమాత్రము చెప్పి యధికారిణి వెడలిపోయెను. వెడలిపోవునపుడు రాధాదేశఘటకురాలగు నేను చెప్పవలసిన దానిని చెప్పకయుందునేమో యని తన్ను గూర్చియే చింతించుచుఁ బోయెను.

# తొమ్మిదవ ప్రకరణము

దేవీ నికేతనము

"కణ్వ. అలం రుదితేన; స్థిరాభవ! ఇతః పంథాన మవలోకయ." —శాకుంతలమ్.

ఉదయమున అధికారిణి నవకుమారునిచెంతకు వచ్చెను. చూడఁగా వాఁడు పరుండియుండలేదు. కావున, వానింగాంచి "యిపుడు చేయవలసిన కర్తవ్య మే"మని యడిగెను.

నవకుమారుఁడు:—ఇది మొదలుకొని కపాలకుండల నాధర్మపత్ని. దీనికొఱకు సంసారమును త్యజింపవలసివచ్చినను త్యజించెదను. కన్యాదాన మొనరించు వా రెవరు?

ఘటకచూడామణియొక్క ముఖము హర్షోత్ఫుల్లమాయెను. ఆమె మనస్సునందు ఇన్నిదినములకు జగదంబయొక్క కృపవలన కపాలిని కొక గతి కల్గె నని యెంచికొని, ప్రకాశముగా, "నేను కన్యాదానము జేసి యిచ్చెద" ననిచెప్పి తన గదికిపోయి, యొక గూఁటియందు పడియుండిన కొన్ని తాటాకులను దెచ్చి యందు తిథి వార నక్షత్రములను జదివి తెలిసికొని లెక్కించి చూచి యీదినము వివాహదినము కాకపోయినను, వివాహమున కేయాటంకమును లేదు. గోధూళిలగ్నమున కన్యాదాన మొనర్చెదను; నీవు ఉపవాసముండవలయును; కులాచారక్రమంబుల నన్నిఁటిని యూరికిపోయిన పిదపఁ జేసికొన వచ్చును. ఒక్కదినముమాత్రము మిమ్మును గోప్యముగా నుంచెదను. వాఁడు వచ్చినను కనఁబడనిచోట నుంచ గలను. వివాహ

మైన పిదప రేపు రేపకడ లేచి పత్నీసమేతుఁడవై పోవచ్చు"
నని చెప్పెను.

నవకుమారుఁడు దీనికి సమ్మతించెను. అప్పటి యవస్థ యం దెంతవఱకు సంభవమో అంతవఱకు యథాశాస్త్రముగా కార్యము నెఱవేరెను. గోధూళిలగ్నమున నవకుమారునికిని కాపాలి కపాలితసన్న్యాసికిని వివాహ మాయెను.

కాపాలికుని విచారసమాచార మేమియు రాలేదు. మరునాఁడరుణోదయంబునకు ముందే ముగ్గురును లేచి ప్రయాణము చేయుటకు సంసిద్ధు లైరి. అధికారిణియే మార్గమును జూపవలయును?

అందఱును ప్రయాణంబునకు సిద్ధము కాఁగానే కపాలకుండల కాళికాదేవికి నమస్కరించుట కరిగి, భయభక్తులతో పుష్పపాత్రయందలి భిన్నముకాని యొకబిల్వమును గ్రహించి కాళికాదేవియొక్క చరణకమలంబున నిడి దానినిం జూచుచు నిలుచుండెను. అది పడిపోయెను.

కపాలకుండల అత్యంత భక్తిపరాయణురాలు. బిల్వపత్రము దేవియొక్క చరణచ్యుతమైనదానిం గాంచి భయఁపడి యధికారిణికిం దెల్పెను. ఆమె విని విషణ్ణయై, యిప్పుడుపాయ మేమియును లేదు. ఇపుడు నీపతియొక్కఁడే నీకు ఉపాయభూతుఁడు, నీపతి శ్మశానమున కరిగినను నీవుకూడ నచ్చటికే పోవలయును. కావున నిశ్శబ్దముగాఁ బొమ్మనియెను.

అందఱును నిశ్శబ్దముగా వెడలిరి. చాలసేపటికి మేదినీపురమార్గమును జేరినమీఁద, అధికారిణి "నేను మరలి పోయెద"నని చెప్పెను. కపాలకుండల యేడ్వసాగెను. ఈపృథ్వి

యుందు కపాలకుండలకు ఒక్క బంధువై యుండినదియు విడిచి పెట్టి వెడలిపోయెను.

అధికారిణియు ఏడ్చెను. పిదప కన్నీటిని తుడిచికొని కపాలకుండల చెవిలో "తల్లీ! పరమేశ్వరీ ప్రసాదంబున నీసేవకురాల నైన నా కర్థాభావము లే దనునది నీ వెఱుంగుదువు. మూర్ఖులు, పండితులు, పెద్దవారు, పిన్నవారు, స్త్రీలు, పురుషులు అందఱు నామహాదేవిని పూజించెదరు. నీవును ఆమె పూజ చేయుచుండుము. నీకొంగున కట్టినదానిని నీ స్వామిచేతి కిచ్చి పల్లకిచేసికొని యిద్దరును పోయిరండు; మఱువవద్దు" అని చెప్పెను. అధికారిణి యిట్లుచెప్పి యేడ్చుచునే వెనుక దిరిగి పోయెను. కపాలకుండలయు నేడ్చుచునే ప్రయాణము చేసెను.

# పదియవ ప కరణము

రాజమార్గము

"———There—now lean on me;
Place your foot here———"

—*Manfred*

ఎవఁడో యొక గ్రంథకారుఁడు "మానవ జీవనచరిత్ర మొక కావ్యవిశేష" మని చెప్పియున్నాఁడు. కపాలకుండల యొక్క జీవనము కావ్యమునం దొక సర్గము సమాప్తమైనది. ముం దేమగును?

నవకుమారుఁడు మేదినీపురంబును జేరి యధికారిణి యిచ్చిన ధనమువలన కపాలకుండలకొఱకు నొకదాసిని, ఒక సేవకుని,

పల్లకిని, పల్లకిమోయుటకు బోయలను అమరించుకొని, కపాల కుండలను పల్లకిలోఁ గూర్చుండఁబెట్టి ముందుగాఁ బంపెను. ద్రవ్యసహాయము తక్కువయగుటచేఁ దాను పాదచారియై పోయెను. నవకుమారుఁడు కడచిన దినమునబడిన పరిశ్రమముచే క్లాంతుఁడై యుండెను. మధ్యాహ్న భోజనానంతరము బోయలు త్వరత్వరగా ముందు వెడలి పోయిరి. నవకుమారుఁడు చాలదూరము వెనుకజిక్కెను. క్రమముగా ప్రొద్దువాలుచు వచ్చెను. శీతకాలపుఁ బెడమేఘ మాకాశమంతయుఁ గ్రమ్ముకొనియెను. సంధ్యారాగము తగ్గిపోవుచుండెను. పృథ్వియంతయు నంధకారమయం బాయెను. కొంచెము చినుకులును పడుచుండెను. నవకుమారుఁడు కపాలకుండలతోఁ గూడ పోవలయు ననెడివ్యసనచిత్తుఁడాయెను. ముందు మజిలియందే యాయమను గలిసికొనవచ్చు ననెడినమ్మకము గలిగియుండెను. అయినను, ముందు మజిలినిగాని, సత్రముగ్గాని, యేదియు నగపడలేదు. ఆవేళ రాత్రి యొనిమిది తొమ్మిది గడియలై యుండెను. నవకుమారుఁడు త్వరత్వరగాఁ బోగెను. పోవునపుడు మార్గంబునం దాకస్మికముగ నేదో యొక కఠినపదార్థము కాలికి తగిలెను. దానిపై కాలూనినిలువఁగా నది పటపట శబ్దమై పొడిపొడియాయెను. నవకుమారుఁడు కొంచెముసేపచ్చటనే నిలిచెను. మరల నడిచెను; అట్టిదే కాలికి తగిలి తుత్తునియ్యలాయెను. విరిగిన పదార్థమును ఎత్తిచూడఁగా నది విరిగిన పలక తునుకగా నుండెను.

ఆకాశము మేఘాచ్ఛాదితమై యుండినను మైదానమునఁ బడియుండిన ఘనపదార్థముల యవయవస్వరూపము గన

పడినంతటి చీకటికాదు. ఆసమీపమున నొక గొప్పపదార్థము పడియుండెను. నవకుమారుఁడు నిదానించి చూడఁగా నది విరిగిపోయిన పల్లకిగా నుండెను. దానింగాంచి కపాలకుండలకేదోవిపత్తు సంభవించినదని భయపడెను. ఆపల్లకి దాపునకు పోఁగా నింకొకపదార్థము కాలికి సోఁకెను. ఆస్పర్శము కోమలమగుమనుష్యశరీరస్పర్శగా బోధమాయెను. దానిని స్పృశించి చూడఁగా మనుష్యశరీరమై యుండెను. శరీరము మిగుల చల్లఁగానుండెను. చేతికి ద్రవమయము తగిలెను. నాడిపట్టిచూచెను. నాడి తెలియలేదు. ప్రాణవియోగమైయుండునేమో యని చెవియిచ్చి వినఁగా శ్వాసము వినఁబడుచుండెను. శ్వాసముండియు నాడి కనఁబడకుండుటకుఁ గారణమేమి? ఇదేమి రోగమా? ముక్కు సమీపమున చేయినిడిచూచెను. ఊపిరి యాడలేదు. అట్లయిన, ఈశబ్ద మెక్కడిది? ఎవరో జీవితవ్యక్తి యిట నుండవలయునని భావించి, "ఇచ్చట నెవరైనను జీవముతో నున్నారా?" యని యడిగెను. మృదుస్వరముతో "నున్నా" నని యుత్తరము వచ్చెను.

నవకుమారుఁడు:—నీ వెవరు?

ఉత్తరము:—నీ వెవరు?

ఈ శబ్దము నవకుమారునిచెవికి స్త్రీకంఠధ్వనివలె వినఁగా భయముతో కపాలకుండలవా యేమి! యని యడిగెను.

స్త్రీ:—కపాలకుండల యెవరో నే నెఱుంగను. ఇప్పుడు నేను దొంగలచేతఁబడి నిష్కుండలనై యున్నాను. నాకుండలాద్యాభరణములను తీసికొనిపోయిరి.

"నిష్కుండల" అను వ్యంగ్యోక్తిని విని నవకుమారుఁడు కొంచెము ప్రసన్నవదనుండై "ఏమాయె" నని యడిగెను.

స్త్రీ: దొంగలు నాపల్లకిని తునియలుచేసి బోయలలో నొకనిని నజికి చంపివేసిరి. తక్కినవారు పరువిడిపోయిరి. దొంగలు నా యాభరణంబులను తీసికొని నన్ను పల్లకికి బిగించి కట్టివేసి పాఱిపోయిరి.

నవకుమారుఁ డంధకారంబున బిరానపోయిచూడఁగా నిజముగా నొకస్త్రీ పల్లకికి వస్త్రముచే దృఢముగాఁ గట్టఁబడి యుండెను. అతఁ డాయమబంధమును త్వరగా విప్పి, "నీవు లేవఁగలవా?" యని యడిగెను. "నాకాలి కొకదెబ్బ తగిలియున్నది; కాలు నొప్పిగానున్నది; కొంచెము చేయిచ్చినచో లేవఁగలనని తోఁచుచున్న" దనెను.

నవకుమారుఁడు చేయినిచ్చెను. ఆమె ఆ సహాయము వలన లేచెను. నవకుమారుఁడు "నడువఁగలవా?" యని యడిగెను.

ఆస్త్రీ దానికి ఉత్తరమీయక, "వెనుక నెవరైనను పథికులు వచ్చుటను జూచితివా?" యని యడిగెను.

నవకుమారుఁడు:— లేదు.

స్త్రీ:— సత్ర మెంతదూరమునం దున్నది ?

నవకుమారుఁడు:— ఎంతదూర మున్నదో నే నెఱుంగను; సమీపముననే యుండునని తోఁచుచున్నది.

స్త్రీ:— చీఁకటియం దొంటరిగా నీమైదానమున నుండుట సరికాదు; నీతోఁగూడ సత్రమువఱకు వచ్చుట మంచిదని

తోఁచుచున్నది. ఏదేని అవలంబనము దొరకినచో దానిపై భారముంచి నడువ నగు ననియెను.

నవకుమారుఁడు:— విపత్కాలమున సంకోచించుట మూఢ పద్ధతి. నాభుజముపై భారము వేసి నడచిరమ్ము.

ఆస్త్రీయు, వానిభుజముపై చేతులుంచికొని వానిపై భారము వేసి నడచెను.

దైవాధీనముగా సత్రము సమీపముననే యుండెను. ఆకాలమున దొంగలు గ్రామములు దగ్గరనుండినను దుష్కృత్యములు చేయుటకు సంకోచించుటలేదు. శీఘ్రముగానే నవకుమారుఁడు సహవాసకత్తెతో నొకయూరు చేరెను.

ఆయూరియందే కపాలకుండలయు విడిసియుండెను. ఆమె వెంటవచ్చినవా రొక విడిదియిల్లు చేసియుండిరి. నవకుమారుఁడు తనతో వచ్చిన దానికిని ఆయింటి ప్రక్కను నొక యింటిని యేర్పాటుచేసి యచ్చట విడిపించెను. వాని యిష్ట ప్రకారము అయింటి దొకదీపమును దెచ్చియిచ్చెను. దీపము వెలుతురు సహవాసకత్తె దేహముపై ప్రసరించెను. నవకుమారుఁడాయమ సుందరి యని దెలిసికొనెను. దాని రూపరాశి తరంగమును, దాని యౌవనశోభారాశియు శ్రావణమాసము నందు సంపూర్ణముగాఁ బ్రవహించు నదివలె ఉచ్ఛలిత మగుచుండెను.



# పదునొకండవ ప్రకరణము

## పాంథానివాసము

"క్వైషా యోషిత్ ప్రకృతిచపలా"

-ఉద్ధవదూతము.

ఈ రమణీమణి నిర్దోషసౌందర్యవిశిష్టురాలై యున్న యెడల, ఓపురుషులారా! ఇది మీసతులకన్న సుందరియనియు, ఓస్త్రీలారా! దర్పణమునఁ గానంబడు మీస్వచ్ఛాయవలె సుందరియనియును చెప్పనొప్పును. అట్లు చెప్పినచో సౌందర్యాతిశయవర్ణనము ఏకశేషమగును గదా? దౌర్భాగ్యవశమున నిది సర్వాంగసుందరి కాదు. కావున వర్ణింపలేదు.

ఇది నిర్దోషముగు సుందరి కాదనుటకుఁ గారణమేమనఁగా; మొదటిది దీనిశరీరము మధ్యమాకృతికన్నను గొంచెము దీర్ఘమైనది. రెండవది అధరోష్ఠ మించుక యెత్తిగిలి యున్నది. మూఁడవది గౌరాంగి కాదు.

శరీర మించుక దీర్ఘమైనను, కాలుసేతులును వక్షము మొదలైన సర్వాంగములును గుండ్రమై సంపూర్ణతను బొంది యున్నవి. వర్షాకాలమున వనజ్యోత్స్న యనులత తన పత్త్ర రాశియొక్క బాహుళ్యముచే నెట్లు తళతళలాడునో దీనిశరీరము నట్లే పూర్ణతచే తళతళ మనుచుండెను. అందుచే నించుక దీర్ఘమైనశరీరము పూర్ణతచే నధికాలంకారంబునకుఁ గారణముగ నుండెను. ఎవరిని గౌరాంగు లని చెప్పెదమో, వారిని, కొందఱు పూర్ణచంద్రుని కౌముదివలెను, కొందఱు

కొంచె మారక్తమగు సుషస్సువలెను వర్ణింతురు. దీనివర్ణమున నివిరెండును లేవు. గాన దీనిని గౌరాంగియని చెప్పలేదు. అయి నను మోహావిలాసంబు గల్పించు వర్ణమునందు కొఱతలేకుండెను. ఇది శ్యామలాంగి "శ్యామలలోకమాత" "శ్యామసుందరి" అనుటకుఁ దగిన శ్యామలవర్ణము గలదిగ నుండలేదు. ఇది తప్తకాంచనమున కెట్టి శ్యామలవర్ణ ముండునో యట్టివర్ణము గలదిగ నుండెను పూర్ణచంద్రకిరణరేఖ, లేక హేమాంబుదమే కిరీటముగాఁగల యుషస్సు. గౌరాంగుల వర్ణప్రతిమగా నుండినచో; :
మామిడిచిగుళ్లకాంతి యీ శ్యామాంగియొక్క వర్ణమున కనురూపమై యుండు నని చెప్పవచ్చును. పాఠకమహా శయులం దనేకులు గౌరాంగుల వర్ణప్రతిష్ఠ గలవారై యుండ వచ్చును. అయినను, ఎవరైనను ఇట్టి శ్యామల మంత్రమునకు ముగ్ధులగునెడల వారు వర్ణజ్ఞానశూన్యు లని చెప్ప నొప్పదు. ఈమాట కెవరైనను కోపించికొనువారున్నచో, నట్టివా రొక్కసారి నవచూతపల్లవమున విరాజిల్లు భ్రమరమువలె నుండెడియుజ్జ్వలమైన శ్యామలవర్ణముగల లలాటవిలంబిత మగు నలకావళిని మనస్సునఁ దెచ్చుకొందురుగాక! ఆ సప్త మీ చంద్రాకృతినైన లలాటతలమునందుండు అలకస్పర్శి నైన భ్రూయుగ్మమును మనస్సునఁ దెచ్చుకొందురుగాక! ఆ పక్వమైన చూతఫలోజ్జ్వల మగు కపోలదేశమును స్మరించి కొందురుగాక! దాని మధ్యమునందుండు ఆరక్తమగు చిన్న చిన్నవైన యోష్ఠాధరంబులను జ్ఞాపకమునకుఁ దెచ్చుకొందురు గాక! అట్లు మనస్సునఁ దెచ్చుకొని స్మరించి జ్ఞాపకముచేసి

కొనినచో నీయపరిచితురాలగు రమణీమణి సుందరులలో ప్రధానురాలని యనుభవమగును. కన్నులతివిశాలమైనవి కావు. అయినను, సుపంకిమపల్లవరేఖావిశిష్టమైనవి. మఱియు నతిశయోజ్జ్వలములైనవి. ఆకటాక్షము స్థిరమైనది. అది మర్మభేది. మీపైని ఆదృష్టిపడినచో వెంటనే యాస్త్రీ మీ మనఃపర్యంతమును జూచుచున్నదని భావింతురు. చూచుచుండఁగనే యాదృష్టి భావాంతరమును బొందును. చక్షువులు కోమలములై స్నేహమయంబగు రసంబునఁ గరఁగిపోవును. మఱియు నొక్కొకవూఱు ఆనేత్రములు మన్మథుని స్వప్నశయ్య యనునట్లు దానియందు కేవలము సుఖావేశమునం గల్గిన క్లాంతిప్రకాశముమాత్ర ముండును. ఒక్కొకసారి లాలసముచే విస్ఫారితమై మదనరసంబున మునిఁగి తేలును. మఱియు నొక్కొకసారి లోలాపాంగమునందు క్రూరమైన కటాక్షము మేఘమధ్యమునందలి విద్యుద్దామమో యనునట్లుండును. ముఖకాంతియందు అనిర్వచనీయమైన రెండువస్తువులు శోభిల్లుచుండెను. మొదటిది సర్వత్రగామి యగు బుద్ధిప్రభావము. రెండవది యత్యంతమగు ఆత్మగరిమ (Self conceit or vaunt). దానిచే నాయమ మరాళగ్రీవమువలె గొంతుత్రిప్పి నిలిచినపుడు ఢీపె. రమణీకులంబునకు రాజ్ఞివలెఁ జూపట్టును.

ఆమెవయస్సు పదునేడువత్సరము లుండును. భాద్రపదమాస నదీప్రవాహజలములవలె దీని రూపరాశి తొనఁకుచుండెను. ఉప్పొంగి ప్రవహించుచుండెను. వర్ణముకన్నను, నయనంబులకన్నను, అన్నిటికన్న నా సౌందర్యపారిప్లవ మత్యంత ముగ్ధకరమై యుండెను. పూర్ణయౌవనభరితురాలై

సర్వశరీరమును సదా యించుక చలించుచుండెను. వాయువు లేని నవశరన్నదీజలమె ట్లీషచ్చంచల మగుచుండునో యట్టి చంచలము. ఈ చాంచల్యము ముహూర్తముహూర్తానుత్న శోభావికాసంబునకుఁ గారణమై యుండెను. నవకుమారుఁ డనిమిషలోచనుండై యానవలావణ్యశోభారాశిని జూచుచుం డెను.

ఆసుందరి నవకుమారుఁ డనిమిషలోచనుండై చూచు చుండుటంగాంచి "నీ వేమిచూచెదవు?" యనియెను.

నవకుమారుఁడు, గొప్పయింటివాఁడు; అప్రతిహతుఁడై తలవంచు కొనియెను. వాఁడు నిరుత్తరుఁ డగుటంగాంచి యామె చిఱునవ్వున "నీ వెపుడును స్త్రీలను జూచి యెఱుఁగవా? లేక, నేను బహుసుందరి ననిభావించితివా?" యనెను.

సహజముగా నీమాట తిరస్కారస్వరూప మైనమాట యని బోధపడియెడిని. అయిన, నావనిత యెట్టినవ్వున నీమాట చెప్పెనో దానిచే నది హాస్యమే. వేరే యర్థము కాలేదు. నవకుమారుఁ డిది యసంబద్ధవచనములాడు స్వభావముగలది (Loquacious or speaking harshly). దీనిమాట కుత్తర మీయఁగూడదా? యని తలంచికొని, "నేను స్త్రీలను జూచినాఁ డను, అయిన నిట్టి సుందరిని చూడలే" దనియెను.

ఆరమణి గర్వమున, "నొక్కతెనైనఁ జూడలేదా?" యనియెను. నవకుమారుని హృదయమున కపాలకుండల రూపము జాగరితమగుచుండెను; వాఁడును గర్వముతో. "నొక్కతెనైనం జూడలేదని చెప్పలే" ననియెను

ఆతనికి యిసుము సోకినట్లు యావనిత “అది యెవ్వరు? నీగృహిణియా?” యనెను.

నవకుమారుడు:—గృహిణి నేల జ్ఞాపకంబునకు వచ్చినది?

స్త్రీ:—బంగాళీలు తమగృహిణులు అందఱికన్న నధికసుందరు లని భావించెదరు కాదే?

నవకుమారుడు:—నేను బంగాళివాడను. సరియే నీవును బంగాళిదానివలె మాటలాడెదవు. అయిన నీదేశ మెయ్యది?

అనువతి “నావస్త్రములను జూడుము. నేను బంగాళిస్త్రీని గాను. పశ్చిమదేశ ముసల్మానురాల” ననియెను. నవకుమారుడు దృష్టించి చూడగా అవస్త్రములు పశ్చిమదేశపు ముసల్మానుల యుడుపులవలె నుండెను. ఒక్కనిమిషముతాలి ఆతరుణీమణి, వాగ్వైదగ్ధ్యముతో (Cleverness or Cunning in speech) “నాపరిచితి మీకు దెలియజేసితి. మీ పరిచయమును దెల్పి నన్ను గృతార్థురాలినిగా నొనరింపుడు. ఆ యద్వితీయ రూపవతియగు గృహిణియుండు గృహ మెయ్యది? ఎచ్చట నున్నది?” యని యడిగెను.

నవకుమారుడు:—మా నెలవు సప్తగ్రామము.

ఆ విదేశిని యేయుత్తరము నీయలేదు. ఉన్నట్లుండి తల వాంచి దీపమును ఉజ్జ్వలముచేయ నారంభించెను. కొంచెము సేపటికి ముఖము నెత్తకయే “యీదాసిపేరు మోతి; నీపేరు చెప్పవచ్చునా?” యనెను.

నవకుమారుడు:—నవకుమారశర్మ యనెదరు. ఇంతలో దీప మారిపోయెను.

---

# పంద్రెండవ ప్రకరణము

## సుందరీ సందర్శనము

"సఖిభుజమోహాన మూర్తిం ద్వైపీం సౌందర్యగంభీరాం,
ఆవిశమేతేంగతతే ర్యాబ్జమైరాకల్పనం కలయే"

మేఘనాదవధము.

నవకుమారుఁడు ఇంటిదానిని వేరే దీపము తెమ్మనెను. వేరే దీపము దెచ్చునంతలో వాఁడు నిట్టూర్పువుచ్చిన శబ్దమును వినెను. దీపము తెచ్చిన కొంతసేపటికి యొక తురకభృత్యుఁడు వచ్చి నిలిచెను. విదేశిని వానింగాంచి, "యేల కింత ప్రొద్దాయెను? తక్కినవా రందఱు నెక్కడ?" యనియడిగెను.

భృత్యుఁడు:—బోయీ లందఱును త్రాగి యొచ్చటికో పోయి యుండిరి. వాని నందఱను వెతకి వెతకి పిలుచుకొని వచ్చుటకు సావకాశమై నేను పల్లకివెనుక జిక్కితిని. తుదకక్కడికి వచ్చి చూడఁగా పల్లకి విఱిగిపడియుండెను. మాకు దిక్కు తోఁచక తమ కేమాయెనో? ఎచ్చట నున్నారో? యని యొక్కొక్కఁ డొక్కొక దిక్కునకుఁ బోతిమి; నే నీ యూరికి వచ్చితిని.

మోతి:—వారల నందఱను బిలిచికొనిరా, పో.

భృత్యుఁడు సలాముచేసి వెడలి పోయెను. విదేశిని కొంచెముసేపు కరలగ్నకపోలరై కూర్చుండెను. నవకుమారుఁడు పోయివచ్చెద నని చెప్పెను. అపుడు మోతి స్వప్నమునుండి

మేల్కాంచిన దానివలె లేచి మొదటిసారివలె "మీరెచ్చట నున్నా"రని యడిగెను.

నవకుమారుఁడు:—పొరుగింటియం దున్నాము.

మోతి:—మీరుండు ఇంటిమొద్ద నొక అందలమును గాంచితిని, మీతో నెవరైనను వచ్చిరా?

నవకుమారుఁడు:—నాభార్య వచ్చినది.

మోతీబీబికి మఱల హాస్యంబునకు సందుదొరకి, "యామె అద్వితీయురాలగు సుందరి?" యనెను.

నవకుమారుఁడు:—చూచినచోఁ దెలియును.

మోతి:—చూడవచ్చునా?

నవకుమారుఁడు:—(ఆలోచించి) ఆటంకమేమి?

మోతి:—అట్లయినచో ననుగ్రహింపుఁడు. అద్వితీయురాలగు రూపవతినిఁ జూడవలయు నని కుతూహలము గలదు.

ముందు నే నామెకు సమాచారము తెల్పవలయును. అయిన నిపుడేవద్దు; ఇపుడు మీరు పోవచ్చును. కొంతసేపటికి సమాచారము చెప్పిపంపెదను.

నవకుమారుఁడు వెడలిపోయెను. పిదపఁ గొంతసేపటి కనేకదాస దాసీ జనులును, బోయలును, పెట్టెలు మొదలు గాఁగల సామానులను తీసికొని వచ్చిరి. వేఱొక పల్లకియు వచ్చెను. దానియం దొక దాసి కూర్చుండి యుండెను. తర్వాత నవకుమారుని యొద్దకు, "బీబి జ్ఞాపకము చేయునట్లు చెప్పిపంపె" నని సమాచారము వచ్చెను.

నవకుమారుఁడు, మోతిబీబి సమీపమునకు మరల పోయెను. చూడఁగా నిప్పు డది రూపాంతరమును దాల్చియుం

డెను. మొదటి దుస్తుల నన్నియు దీసియుంచి సువర్ణముక్తాది శోభిత మగు పట్టుచీరెను ధరించి యుండెను. నిరాలంకారముగ నుండిన దేహము అలంకారముచే ఖచితమై యుండెను. ఎచ్చటి కేది తగియుండునో అదే. కుంతలమునను, కొప్పునను, కపాలమునను, నయన పార్శ్వములను, కంఠమునను, హృదయమునను, బాహుయుగ్మములందును, వేయేల? దేని దేని కెదియెదియొప్పునో దాని దానికిఁ దగిన యాభరణంబులను ధరించి యుండెను. ఆమెశరీర మనెడి సువర్ణమధ్యమునందు వజ్రము మొదలగు రత్నంబులు ఉజ్వలమగు కాంతిచే నొప్పుచుండెను. నవకుమారుని కన్నులు అస్థిరము లాయెను. అనేక స్త్రీలు సువర్ణఖచితులైనను కాంతివిహీన లయ్యెదరు; అనేకు లేదో యొకవిధముగ నలంకరింపఁబడిన బొమ్మలవలె నుండెదరు; మోతీబీబి యందు ఆకాంతి విహీనత, లేక, ఆదశ యెదియు గానరాదు. బహునక్షత్రమాలికలచే నలంకృతంబగు నాకాశమువలెను, మధురాయతమైన శరీరముతోడను, ఆ యలంకార బాహుళ్యము నుసంగతమై బోధమగుచుండినదే గాక దానియందు మఱింత సౌందర్యప్రభయు వృద్ధినొంది యుండెను. మోతీబీబి నవకుమారునిఁగూర్చి "పోవచ్చును; రండు, మీభార్య పరిచయమును సమకూర్పుఁ" డనియెను.

నవకుమారుఁడు మోతీబీబిని పిలుచుకొని పోయెను. పల్లకియందుఁ గూర్చుండి వచ్చిన దాసియు నాయమ వెంట వచ్చెను. ఆదాసిపేరు పేష్మన్.

కపాలకుండల యొక యింటియందు చెమ్మనేలపై నొక్కతెయె కూర్చుండి యుండెను. ఒక దీపము మినుకు

మినుకు మని మండుచు నుండెను. జడవేయని నిబిడ మగు కేశ రాశి వెనుకభాగమునంతయు చీకటిగాఁ జేయుచుండెను. మోతీబీబి మొదట యాయమను జూచినపు డాయము యథర పార్శ్వంబునను, నయనప్రాంతమునను ఇంచుక నవ్వు వ్యక్త మాయెను. చక్కఁగాఁ జూచుటకై దీపమును తానే చేతఁ బట్టి కపాలకుండల ముఖసమీపమునఁ బట్టెను. అప్పు డాయమ హాస్యభావము దూరమాయెను; ముఖమున గంభీరభావమును దాల్చి కపాలకుండలను తెప్పవేయక చూడ నారంభించెను. ఎవరు నేమియుఁ బలుకలేదు. మోతీబీబి ముగ్ధ యయ్యెను; కపాలకుండల విస్మిత యయ్యెను.

చాలాసేపటికి మోతి తనయొడలిపై నున్న యలంకార రాశిని ఒక్కటొక్కటిగాఁ దీయ నారంభించెను. ఆ యాభర ణంబుల నన్నిటిని దీసి యొక్కటొక్కగా కపాలకుండల నలంకరింప నారంభించెను. కపాలకుండలయు ఏమియు ననక యూరకుండెను. నవకుమారుఁడు ఏమి చేయుచున్నావని యడి గెను. మోతి యేమియు ప్రత్యుత్తర మీయలేదు.

ఆభరణంబుల నన్నిటిని యలంకరించి ముగిసిన పిదప మోతీబీబి నవకుమారునిం జూచి, నీవు నిజమాడితివి. ఈ పుష్పము రాజోద్యానమునఁగూడ పుట్టదు. ఇట్టి రూపరాశిని రాజధానియందు చూచుటకు లేదుకదా యని పరితపించు చున్నాను. ఈ యాభరణములన్నియు ఈ దేహంబునకే యొప్పె డిని. అందువలనఁ దొడిగితిని. నీవు వీని నప్పుడప్పు డీయుమకుఁ దొడిగి యానందింపుము. ఆసమయమున నీముగ్ధ యగు విదే శినిని జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనుము అని చెప్పెను.

నవకుమారుఁడు భయభ్రాంతుఁడై "యిదెట్లుసాధ్యము ? ఇవి యమూల్యము లగు నాభరణములు; నేనేల తీసికొనవలయును?" అనెను.

మోతి:—ఈశ్వర ప్రసాదముచే నాకింకను అనేకాభరణములు గలవు. ఈమెకు వీనిం దొడుగుటవలన నాకుం గలిగెడి యానందంబునకు నీవేల వ్యాఘాతమొనర్చెదవు ?

మోతీబీబి యిట్లని వచించి దాసితోఁగూడ వెడలిపోయెను. బయటికి వచ్చినతర్వాత దాసి, బీబీ! "ఈ వ్యక్తి యెవ" రని యడిగెను.

యవనబాల "నాభర్త" యనెను.

---

# పదుమూఁడవ ప్రకరణము

బి కా రో హ ణ ము

"అత్యజతసర్వభూషాః కాంచీకేయూరహారాద్యాః
కంకణహాంసకనాసా మణిమంజీరతాటంకాః".

— మేఘనాథవధము.

ఆభరణముల యవస్థ యేమాయెను ? వినుఁడు—చెప్పెదము. మోతీబీబి, వెండిబంగారు సొమ్ములనుంచెడి దంతపుభరణిని నవకుమారునికిఁ బంపెను. దొంగలు అంతయు తీసికొనిపోలేదు. ఆమెయొద్దనుండిన కొంచెము మాత్రము వారికి దొరకెను. తక్కినదంతయు వెంటవచ్చినవారియొద్ద నుండెను.

నవకుమారుఁ డొకటి రెండు వస్త్రములను మాత్రము కపాలకుండల యొంటిపై నుండనిచ్చి మిగిలినవానిం దీసి యాభరణిలో నుంచెను. మరునాఁ డుదయమున మోతీబీబి వర్ధమానాభిముఖముగను, నవకుమారుఁడు పత్నీసమేతుఁడై సప్తగ్రామాభిముఖముగను ప్రయాణము జేసిరి. నవకుమారుఁడు కపాలకుండలను పల్లకీయందుఁ గూర్చుండఁబెట్టి అభరణముల భరణిని దానియందే యుంచి పంపెను. బోయీలు ముందుగ నడిచిరి. కపాలకుండల పల్లకి తలుపు తెరచుకొని నాల్గుదిక్కులను జూచుచు ప్రయాణము చేయుచుండెను. ఒక భిక్షుకుఁ డామెను జూచి భిక్షమును వేఁడుచు పల్లకితోడఁ బోవుచుండెను.

కపాలకుండల; "నాయొద్ద ఏమియును లేదు; నీకేమి యిత్తు" ననియెను.

భిక్షుకుఁడు, ఆమెపై నుండిన రెండాభరణములను వ్రేలితో జూపుచు, "అదేమి తల్లీ! మీయొంటిపై ముత్యములును వజ్రములు నున్నవి; ఏమియు లేదనుచున్నారే?" అనెను.

కపాలకుండల, "ఈ యాభరణముల నిచ్చినచో సంతుష్టుఁడవగుదువా?" యని యడిగెను.

భిక్షుకుఁడు, విస్మితుఁడై యాశకు మేరలేదు. అని చింతించి "సంతుష్టుఁడను గాకేమి తల్లీ?" యనెను.

కపాలకుండల, నిష్కపటహృదయయై భరణిసమేతముగా నాభరణములనన్నిటిని భిక్షుకున కొసంగెను. ఒంటిపై నున్న వానినిగూడ నిచ్చివేసెను.

భిక్షుకుఁ డించుక నేమియును దోఁచక యూరకుం డెను. దాసదాసీల కిది తెలియదు. వాఁడించుకసేపు అటులనే యుండి, యట్టిట్టుజూచి ఊర్ధ్వశ్వాసముతో భరణిని దీసికొని పాఱిపోయెను. కపాలకుండల భిక్షుకుఁ డేలపరువిడుచున్నాఁ డని యోజించుచుండెను.

# పదునాలవ ప్రకరణము

## స్వదేశము

"శబ్దాఖ్యేయం యదపి కిల తే యస్సఖీనాం పురస్తాత్
కర్ణేలోలః కథయితు మభూ దాననస్పర్శలోభాత్."

—మేఘదూతము.

నవకుమారుఁడు కపాలకుండలను బిలిచికొని స్వదేశ మునకుఁబోయెను. వానికి తండ్రి లేదు; తల్లి యింటియందుం డెను. ఇంక నిద్దరు చెల్లెం డ్రుండిరి. వారిలో పెద్దామె వితంతువు. పాఠకమహాశయుల కామెను పరిచితి సంఘటింపదు. రెండవయామె శ్యామసుందరి. సుమంగలిగా నుండినను విధవ వలె నుండెను. ఎందుకనఁగా, ఆమెయొక్క పతి కులీనుఁడై యుండెను. ఆమె ఒకటి రెండు మాటలు పాఠకులను జూచును.

అవస్థాంతరమునందు అనఁగా, వేఱేసందర్భమై యుండినచో నవకుమారుఁడు తెలియని కులశీలురా లగు తపస్వినిని వివాహము చేసికొని యింటికిఁ బిలిచికొని వచ్చియుండిన పక్షమునం దాత్మీయ జనులు దానింగూర్చి యెంత సంతోషించు

చుందురో, చెప్ప నశక్తులమై యున్నారము. ప్రకృతసందర్భమున వాని కంతటిక్లేశము సంభవింపలేదు. అంచఅును వాఁడు మరలివచ్చు విచారమునందు నిరాశనొంది యుండిరి. వీని సహాయాత్రికులు ఊరుచేరి, నవకుమారుని పులి తినివేసె నని వార్తపుట్టించి యుండిరి. మరలి యూరికివచ్చిచేరిన సత్యవాదు లగు ప్రయాణికు లొక్కొక్కరును ప్రత్యక్షముగాఁ జూచినవారివలె నిజమైన వర్తమానమును జెప్పియున్నారని పాఠకులకు దెలియవచ్చును. అట్లు తెలిసికొనినచోఁ బ్రయాణికుల కల్పనాశక్తి నిరస్తమగును. ఆయాత్రికులందు కొందఱు నవకుమారుఁడు నిశ్చయముగా పులివాతంజిక్కిన దానిని తాము కన్నులారగాంచితి మనిరి. ఒక్కొకసారి పులి యొట్లుండెనను దానింగూర్చి తర్కవితర్కములు జరుగును; కొందఱు ఆపులి యెనిమిదిమూర లుండె నని చెప్పిరి. మఱికొంద ఱది కల్ల; పదునాఱడుగులప్రమాణ ముండె ననిచెప్పిరి. మొదట పాఠకులకు పరిచితుఁడైయుండిన ముసలివాఁడు అదెట్లున్న నేమి? నేనేమో బ్రతికివచ్చితిని. పులి మొదట నన్నే తఱుముకొనివచ్చెను; నేను పాఱి వచ్చితిని. నవకుమారుఁ డంతటిసాహసవంతుఁడు కాఁడు; పరుగిడలేఁడయ్యె నని చెప్పెను.

ఈ వర్తమానము నవకుమారుని తల్లి మొదలగువారికి చెవింబడెను. ఇంటను ఊరను మిగుల రోదనమారంభమాయెను. ఆరోదనము త్వరగా నిల్వలేదు. ఏకపుత్త్రుని మరణవార్తవిని తల్లి మృతప్రాయురాలై యుండెను. ఈసమయమున నవకుమారుఁడు పత్నీసమేతుఁడై యూరుచేరెను. అపుడు వాసని, "నీభార్య యేజాతిది; యెవరి కొమార్తె" యని యెవరు

విచారింతురు ? అందఱు నాహ్లాదమున గ్రుడ్డివారై యుండిరి. నవకుమారుని తల్లి సాదరమున కోడలిని యింటిలోనికిఁ బిలుచు కొని పోయెను.

నవకుమారుఁడు, కపాలకుండల యింటివారిచే నాదరింపఁబడినందువలన, వానికానందము హెచ్చెను. అనాదరణభయమువలన నతఁడు కపాలకుండలాలాభమునం దించుకైనను ఆహ్లాదమునుగాని, ప్రణయలక్షణములనుగాని గనఁబఱచియుండలేదు. వాని హృదయాకాశము కపాలకుండలయొక్క మూర్తిచే సంపూర్ణముగా వ్యాప్తమై యుండినను, భయముచేతనే వాఁడు, ఆమెపాణిగ్రహణ ప్రస్తావంబునకు వెంటనే సమ్మతింపలేదు. ఇల్లు చేరువఱకును ఒక్కతూరియైన నామెతో ప్రణయసంభాషణము చేయలేదు. వాఁడు నిండి నిబిడీకృతమై పైకుబికి రానున్న యనురాగసముద్రమునం దొక్క తరంగమైన పుట్టుట కవకాశ మీయలేదు. ఇపుడు ఆభయము దూరమాయెను. జలరాశియొక్క ప్రవాహవేగమును నిరోధించు శిలాసేతువు త్రెగిపోయినచో నెట్లు దుర్దమమైన ప్రవాహవేగము జనించునో, య ట్లతివేగముగా నవకుమారుని ప్రణయ సముద్రము ఉచ్ఛలిత మగుచు వచ్చెను.

ఈ ప్రేమావిర్భావము మాటలయందు వ్యక్తముకా లేదు. అయినను, కపాలకుండలను గాంచునపుడు, సజలనయనుఁడై యనిమిష లోచనములతోఁ జూచును. దానియందా ప్రణయావిర్భావము వ్యక్తమగుచుండును. కార్యము లేని కార్యము గల్పించుకొని కపాలకుండల సమీపమునకుఁబోవుట యందు వ్యక్తమగు చుండును. మాటలాడుట కవశ్యము లే

బయలుపడుచుండును. రేయింబవళ్లు కపాలకుండల స్వచ్ఛందముగా సుఖముగానుండుటకు వలసినవానిని వెతకుటయందు వ్యక్తమగుచుండును. ఎల్లప్పుడును అనన్యమనస్కురాలై యదుగులిడుటయందు వ్యక్తమగుచుండును. వాని ప్రకృతియే పరివర్తిత మగుచు వచ్చెను. చాపల్యమైనది గాంభీర్యమును వహించెను. ప్రసన్నముకానిది ప్రసన్నత నొందెను. నవకుమారునిముఖము నిరంతరము ప్రఫుల్లమాయెను. హృదయము స్నేహంబున కాధారమయ్యెను గాన, సంఘమందును స్నేహాధిక్యము కలిగెను. విరక్తిని బుట్టించువారియందు విరాగము లాఘవ మగుచు వచ్చెను. మనుష్యుడు ప్రేమపాత్రుఁడాయెను. జగము సత్కార్యములకొఱకే సృష్టింపఁబడినదని తెలియుట కారంభించెను. సకల సంసారప్రపంచము సుందరమైనదని తెలియనయ్యెను. ఇదేకదా ప్రణయ మనునది! ప్రణయము కర్కశుఁడైనవానినిగూడ మృదువుగాఁ జేయును. అసత్తును సత్తుగా జేయును. పుణ్యవివర్జితుఁడైన వానిని పుణ్యవంతునిఁగా జేయును. అంధకారమును ప్రకాశముగాఁ జేయును.

ఇఁక కపాలకుండల భావ మెట్టిది? పాఠకమహాశయులారా! ముందు పొందు; ఆమెను జూతము.

# పదునైదవ ప్రకరణము



అవరోధము

"కిమిత్యపాస్యాభరణాని యౌవనే
ధృతం త్వయా వార్ధక శోభి వల్కలమ్,
వద ప్రదోషే స్ఫుటచంద్ర తారకా
విభావరీ యద్యరుణాయ కల్పతే."

—కుమారసంభవము

పూర్వకాలంబున సప్తగ్రామము మహాసమృద్ధిగానున్న నగర మనునది యందఱకుం దెల్లంబ. ఒకానొక కాలంబున జావాద్వీపమునుండి రోముపట్టణము పర్యంతమును సకలదేశంబుల వర్తకులు వ్యాపారమునకై యిమ్మహానగరంబునకువచ్చుచుండిరి. క్రీస్తుపుట్టక మునుపు పది పదునొకండవ శతాబ్దమున సప్తగ్రామముయొక్క ప్రాచీనసమృద్ధికి లాఘవము గలిగెను. దీనికి ముఖ్యకారణమేమనఁగా. ఆనగరపు ముందుభాగమున ప్రవహించుచుండిన నది క్రమక్రమముగా సంకీర్ణమగుచువచ్చినందున పెద్ద పెద్ద పడవ లానగరమువఱకు రాను సాధ్యపడక పోయెను. ఈ కారణమునుబట్టి క్రమక్రమముగా వాణిజ్యము లుప్తమగుచు వచ్చెను. వాణిజ్యమువలన గౌరవముగల నగరంబున వ్యాపారము నిలిచిపోయినచో దానితోఁగూడ నన్నియు తగ్గిపోవునుకదా! అట్లే సప్తగ్రామంబునం దన్నియు తగ్గిపోయెను. పదునొకండవ శతాబ్దమున హుగలి నూతనసౌష్ఠవముచే సప్తగ్రామంబునకు ప్రతియోగి నగరమై తనరారెను.

అచ్చట పోర్చుగీసువారు వ్యాపారమును ప్రారంభించి సప్త గ్రామ ధనలక్ష్మిని ఆకర్షించుచుండిరి. అయినను, సప్తగ్రామము ఒక్కమాఱుగా హతశ్రీ కాలేదు. అప్పటివఱకు నచ్చట ఫౌజదారు మొదలుగాఁగల రాచఱికమువారు నివసించుచుండిరి. అయినను, నగరము వసతితక్కువదై పల్లెటూరివలె నుండెను.

సప్తగ్రామముయొక్క నిర్జనమైన ఔపనగరిక భాగమునందు నవకుమారుఁడు వసించుచుండెను. అచ్చట తఱుచుగా మనుష్య సమాగమమే లేదు. వీథులయందంతట లతాగుల్మాదులు పెరిగి యుండెను. నవకుమారుని యింటి వెనుకభాగమున నొక విస్తారమగు నిబిడమైన వనముండెను. ఇంటి ముందుభాగమున అరకోసు దూరమున నొక చిన్న నెమలి వచ్చియుండెను. ఆనెమలి కొంచెము దూరము సంచరించుచుండి యింటివెనుకటి భాగముననుండు వనమధ్యమును ప్రవేశించెను. ఆయిల్లు యిటికలతోఁ గట్టఁబడినది. దేశకాల వివేచనముచేసినచో నది కేవలము సామాన్యగృహ మని చెప్పరాదు. రెండంతస్తుల యిల్లు అయినను, అత్యున్నతమైనది కాదు. ఈకాలంబున నొకయంతస్తుగల యిల్లు అంతయెత్తుగా నుండును.

ఆయింటి మిద్దెపై ఇద్దరు నవవయస్కలగు స్త్రీలు నిలుచుకొని నలుదిక్కులను జూచుచుండిరి. సంధ్యాకాలమై యుండెను. నలుదిక్కులం గానంబడుచుండిన చెట్లుచేమలు మొదలగునవి నయనరంజకములై యుండెను. సమీపమున దట్టమగువనము. దానియందసంఖ్యాకములగు పక్షుల కలకల ధ్వని. మఱియొకదిక్కున చిన్ననెమలి వెండి మొలత్రాటివలె

గన్పట్టుచుండెను. దూరమున మహానగరియొక్క అసంఖ్య సౌధమాలికలు. నూతన వసంత పవనస్పర్శలోలుపు లగు నాగరకులచే పరిపూర్ణముగ శోభిల్లు చుండెను. మఱొకదిక్కున చాలదూరమున నౌకాభరణ యగు భాగీరథియొక్క విశాల వక్షఃస్థలమునందు సంధ్యాకాలపు చీఁకటి క్షణక్షణమును గాఢతరముగ నల్లనగుచుండెను.

సౌధముపై నిలిచియుండిన యిరువురలో నొక్కతె చంద్రకిరణ వర్ణకాంతిగలదై యుండెను. జడవేయని కేశభార మధ్యమున మునిఁగిపోయిన దానివలె నుండెను. మఱియొక్కతె కృష్ణాంగి. ఆమె సుముఖిగను; షోడశవయస్కురాలుగను; కృశాంగిగను నుండుటేగాక, ముగ్ధగు చిన్నిమోముగలదిగ నుండెను. ఆమెయొక్క ఊర్ధ్వార్ధదేహమునందు నలుప్రక్క లను చిన్నచిన్న కుంచితకుంతలదామము వ్రేలాడు చుండెను. నీలోత్పలదళరాజి ఉత్పల్యమధ్యమునందు చుట్టుకొని యున్న వియో యనునట్లుండెను. దాని నయనయుగళము విస్ఫారితమై కోమలమగు శ్వేతవర్ణముగల పద్మపలాశసదృశమై యుండెను. చిన్న చిన్నవియై గుండ్రమగుదానివ్రేళ్లు దానితోఁ గూడనుం డిన సుందరియొక్క కేశతరంగమధ్యమున గన్పట్టుచుండెను. పాఠకమహాశయులు ఆచంద్రకిరణవర్ణశోభిని కపాలకుండల యనియు, ఆకృష్ణాంగి యామెవదినెయగు శ్యామాసుందరి యనియు గ్రహింపవలయును.

శ్యామాసుందరి తన యన్నభార్యను "వదినె" "మృణా" యనియు పిలుచుచుండెను. కపాలకుండల యను నామము వికటమైయున్నదని యింటివారు మృణ్మయి యని

పిలుచుచుండిరి. దానిచే "మృణా" యనియెడి సంబోధనము గలిగెను. మే మొక్కొకతూరి యామెను మృణ్మయి యనియే బిలుతుము.

శ్యామాసుందరి శైశవాభ్యస్తమయిన పాటలలో నొకపాటం బాడెను. ఎట్లన;

గేయము.

పల్లవి. పతిభక్తిగలపతి విలసిత గుణవతి,
సతతము దానికే సకలసౌఖ్యము జగతి. పతి.
చరణము.1. కమలములెల్లను కాంతుఁడౌ మిత్రుని
విమలజలమునుండి వేగరాఁగోరెడి
అమితోత్సాహంబున నడవియందలిలతలు
అమరియున్నవి చెట్ల నల్లుచు చెల్వునై. పతి.
2. ఘనతరవాంఛచే కడలిఁ జేరు నదులు
అనయముఁ జంద్రునిఁ గననెంచుఁ గల్వలు
వినయము మీఱఁగా విభునిపాదము లొత్తి
మనసార కౌఁగిలి మగువలిత్తురుభువిని. పతి.
3. ఇదియేమి చిత్రమో యీశా! లోకేశ్వరా!
సదయునిపై ప్రేమ చాలించు కొఱుఁగనే,
ముదముతోడ విషాద మొదవి యున్నది చూడ
మది స్వర్ణమణిసోఁక భ్రాన్తపడ కతమేమొ. పతి.

అని యిట్లుపాడి, "యేమే వదినే! నీవొక్కతెవు మాత్రము తపస్వినిగా నుందువా?" యనెను.

మృణ్మయి:—ఏల? నే నేమితపస్సు చేయుచున్నాను? శ్యామాసుందరి తన రెండు చేతులతోను మృణ్మయి కేశతరంగ

మాలికను సవరించిపట్టుకొని; "నీ పీకేశ రాశిని దువ్వి జడ వేసికొనుటలేదా?" అనెను.

మృణ్మయి, చిఱునవ్వుతో శ్యామాసుందరి చేతినుండి పెండ్రుకలను బలవంతముతో విడిపించుకొనెను.

శ్యామాసుందరి మరల, "మా యాశనైనను నెఱవేర్పుము. ఒకతూరియైనను మనయింటి యాడువారివలె కట్టి తొడుగరాదా! ఎన్ని దినములు యోగినిగనుందువు?" అనియెను

మృణ్మయి:—నేను ఈ బ్రాహ్మణసంతానులను (నవకుమారుని) జూచువఱకును యోగినిగానే యుంటిని.

శ్యామా:—ఇపు డట్లుండరాదు.

మృణ్మయి:—ఎందుల కుండరాదు.

శ్యామా:—ఎందులకా? చూచెదను. నీయోగమును తప్పించెదను. స్పర్శమణి (Philosopher's Stone) అని దేనికై చెప్పెదరో తెలియునా?

మృణ్మయి:—తెలియదు.

శ్యామా:—స్పర్శమణి స్పర్శముచే ఇనుము సువర్ణమయ్యెడిని.

మృణ్మయి:—దానివలన నేమి?

శ్యామా:—స్త్రీలకుకూడ నొక విధమగు స్పర్శమణి గలదు.

మృణ్మయి:—అదెయ్యది?

శ్యామా:—పురుషుఁడే స్త్రీలకు స్పర్శమణి. పురుషుని గాలి సోఁకినమాత్రాన యెట్టి యోగినియు యగును.

నీవామణిని స్పృశించి యున్నావా? నీవును మేము చేసి నట్లు చేసెదవు. నీవేచూతువు. నేనే ఆ పాటను బాడెదను.

గేయము

పల్లవి. యోగినీసుశీలబాల మారకీరమా
వేగ రావె చంద్రవదన వేడ్కమీఱఁగా.

చరణములు

౧. కబరియందు కుసుమచయము నుంతు ముదమున
అబల చంద్రరవులనిడెద నతిప్రియంబున. యోగినీ.
౨. నుదుటబొట్టు కనులకాటుకయును దీర్చెద
పదములపారాణి బాగుగానొనర్చెద. యోగినీ.
౩. కర్ణమందు రత్నతాటంకముంతునే
స్వర్ణకంకణములు హస్తమున ఘటింతునే. యోగినీ.
౪. రత్నహారములను కంఠమందువైచెద
నూత్న చేలమమరఁజాల్ప నీకొసంగెద. యోగినీ.
౫. అధరమునను మధురరసము నింపవే చెలీ
సుధాసలిప్తమ్ములమును గొనుమువే చెలీ. యోగినీ.
౬. ముద్దుగుల్క పట్టినెత్తి ముద్దులాడఁగా
యొద్దనుండి సంతసింతు వలపు హెచ్చఁగా. యోగినీ.

మృణ్మయి:—మంచిది; తెలిసెను. స్వప్నమణినంటి యున్నదానను; చంద్రవదన నైతిని; తిలకమును కాటుకను నుంచుకొంటిని; పీతాంబరమునుఁ గట్టితిని; కొప్పునఁ గుసుమదామము నుంచితిని; కర్ణములయందు రత్నఖచితమైన కమ్మల నలంకరించితిని; కంఠంబునకు హారమాయెను; హరిద్రాకుంకుమ చందనాదులాయెను; అన్నియు నాయెను; ఇవన్నియు నున్నవనియే యనుకొందము; వీనిచే నేమి సుఖ మబ్బినటులాయెను?

శ్యామా:—నీవు చెప్పుము, చూతము. పుష్పము వికసించి నచో దాని కేమిసుఖము?

మృణ్మయి:—జనులకు ధరించుటకు సుఖము. పుష్పమున కే మైనది?

శ్యామసుందరి ముఖకాంతి గాంభీర్యతను వహించెను. ప్రభాతమందానిలమువలన చలించు నీలోత్పలమువలె విస్ఫారితమైన నయనము లించుక చలించినవి. అనంతరము ఆమె, పుష్పమున కేమాయెనా? దానిని నేఁ జెప్పలేను. నేను పుష్పముగా పుట్టి వికసించలేదు. అయినను, నీవలె మొగ్గగానుండి యున్నయెడల వికసించి సౌఖ్యపడుదును.

శ్యామ, కులీనునిపత్నియై యుండెను.

ఇచ్చటకొంత యవకాశమును బుచ్చుకొని పాఠకులకుఁ దెల్పున దేమనఁగా:—పుష్పమునకు వికసించుటే సుఖము. పుష్పరసము; పుష్పగంధము; వీనిని ఇతరులకుఁ దెలియఁ బఱచుటయే వానికి సుఖము. ఆదానప్రదానమే పృథ్వియందు సుఖంబునకు మూలమైన యది. వేఱేద్దియుఁ గారణము కాదు. మృణ్మయి వనమునుండియు దీని నెఱింగి యుండలేదు. అందు చేత శ్యామ కే యుత్తరము నీయలేకపోయెను.

శ్యామాసుందరి, మృణ్మయి యూరకుండుటంగాంచి—మంచిది, నేఁజెప్పినది కాకున్న నీకెద్ది సుఖమో చెప్పుము; చూతము? అనెను.

మృణ్మయి కొంచెము ప్రొద్దాలోచించి, "చెప్పలేను. సముద్రతీరమున నా వనమధ్యమందు తిరుగుచుండుటవలన నాకుసుఖముగలుగు నని తోఁచెడిని" అనెను.

శ్యామాసుందరి కొంచె మాశ్చర్య మొందెను. మఱియు తనప్రయత్నము మృణ్మయియొద్ద సాగలేదని యించుక కలతయుఁ జెందెను. కొంచెము కోపమును దాల్చి, "మరల వచ్చినచోటికే పోవుట కుద్దేశించి యున్నావా యేమి?" యనెను.

మృణ్మయి:—ఆ యుద్దేశము లేదు.

శ్యామ:—అట్లైన నేమి చేయుటకు నిశ్చయించితివి?

మృణ్మయి:—అధికారిణి "యథా నియుక్తోస్మి తథా కరోమి" అని చెప్పుచుండెను.

శ్యామాసుందరి చెఱగుతో నోరు మూసికొని నవ్వి, "భట్టాచార్య మహాశయా! ఏమాయెను? అనుమతి యేమి!"

మృణ్మయి:—నిట్టూర్పు నిగుడించి విధాత యెట్లు చేయునో, అట్లు చేసెదను. నొసట లిఖించినట్లగును, అనెను.

శ్యామ:—ఏల? నొసట వ్రాసిన దింకేమి? నొసట సుఖము లిఖింపఁబడినది. నీవు నిట్టూర్పువుచ్చిన దానికి హేతువేమి?

మృణ్మయి:—వినుము, చెప్పెద. నేను నా పతితో ప్రయాణము చేయుదినమున భవాని పాదములపై బిల్వదళము సర్పించితిని. కార్యము శుభమగునెడల నాజగజ్జనని పాదములపై ఆపత్రము నిలుచును! అశుభము ఘటిల్లునట్లుండినచో నది పడిపోవును. అపరిచిత వ్యక్తితో నన్యదేశంబునకుఁ జనుటకు భయమై మంచిచెడ్డలను తెలిసికొందమని అట్లుకావించితిని. ఆమె బిల్వపత్రమును ధరింపలేదు. అందుచే నొసట నేమి లిఖింపఁబడినదియో యెఱుఁగను.

ఇట్లని చెప్పి మృణ్మయి యూరకుండెను. శ్యామాసుం దరి యించుక భీతినొందెను.

# పదునారవప్రకరణము

భూత పూర్వము

"కష్టోయం ఖలు భృత్యభావః"

—రత్నావళి.

సనకుమారుఁడు కపాలకుండలను బిలుచుకొని గ్రామము విడిచి వెడలినపుడు మోతీబీబి వర్ధమానాభిముఖియై ప్రయాణముచేసె నని చెప్పియుంటిమి గదా! ఆమె దారియందు పయనము జేయుచుండనిండు. మేము ఈమధ్య యామె పూర్వవృత్తాంతమును గూర్చి కొంత ప్రశంసించెదము. మోతీబీబిచరిత్రము మహాదోషముచే కలుషితమైనది మహద్గుణంబులయందును ప్రకాశమానమైనది. ఇట్టి చరిత్రముయొక్క వి స్తృతవృత్తాంతమువలనఁ బాఠకమహాశయులు అసంతుష్టులు కాఁగూడదు.

దీని జనకుఁడు మహమ్మదీయజాతికిఁ జేరినపుడు, దీనికి 'ఉత్ఫఉన్నీసా' యనుపేరు నిడిరి. మోతీబీబి యను నామము ప్రకృతకల్పితము. ఈమె ప్రచ్ఛన్నవేషంబున దేశసంచారము చేయునపు డీపేరు పెట్టుకొనును. దీనితండ్రి ఢక్కానగరమును జేరి యచ్చట నుద్యోగమున నిలిచెను. అయిన నచ్చటికి వాని స్వగ్రామమునుండి స్వజను లనేకులు వచ్చుచుఁ బోవుచు నుండిరి గాని, సమాజచ్యుతులైన వీరి మధ్యమున నుండుటకు స్వజనుల

కెవరికిని యిష్టములేదు. మఱికొన్నాళ్లకంతయు నచ్చటి దర్బా
రున మంచియోగ్యుఁడని యనిపించికొని, యచ్చటి కార్యా
ధ్యక్షులచేతను గొప్పగొప్ప ఉమ్రాలచేతను యోగ్యతా
పత్రికలను సంపాదించుకొని సపరివారుఁడై ఆగ్రాపట్టణ
మును జేరెను. అక్బరుపాదుషా ఉద్యోగస్థులను జూచినం
తనే వారిగుణములను తెలిసికొను శక్తిగలవాఁడై యుండెను.
శీఘ్రకాలముననే యితని గుణవిశేషములు పాదుషాకు తెలి
యవచ్చినందున గొప్ప పదవినిబొంది ఆగ్రాయందలి ప్రధాను
లైన ఉమ్రాలలో గణ్యుఁడాయెను. ఇట్లుండ, లుత్ఫున్నీసా
క్రమముగా వయఃప్రాప్తినిఁ బొందెను. ఆగ్రాచేరి ఫార్సి,
సంస్కృతము, నృత్యము, గీతము, రసవాదము మొదలగు
విద్యలయందు సుశిక్షితురాలై చాలనైపుణ్యముగలదై, రాజ
ధానియందలి అసంఖ్యాకగుణవతు లగు రూపవతులయందు
అగ్రగణ్యురాలగుచు వచ్చెను. దౌర్భాగ్యవశమున విద్యా
సంబంధమున నెట్టిశిక్ష జరుగుచుండెనో నీతిసంబంధమున నట్టి
శిక్ష జరుగుచుండలేదు. వయోవిలాసము ప్రబల మగుచుండి
నట్లంతయు దానిమనోవృత్తియొక్క వేగము దుర్దమ మగుచు
వచ్చెను. ఇంద్రియదమనశక్తియే లేదు. సదసత్తులయందు
సమానప్రవృత్తి గలిగెను. ఇదిమంచిది; ఇదిచెడ్డది, యనియెడి
విచారమే లేదు. ఏది మనస్సునాటునో దానినే చేయును.
సత్కర్మమువలన నంతఃకరణంబున సుఖనొందు నని బోధపడి
సత్కర్మ అసత్కర్మ మనస్సు
నకు సుఖదాయక మని బోధపడినచో నపుడు అసత్కర్మముల
నాచరించును. యౌవనమనోవృత్తి దుర్గమమైనప్పుడే దోష

ములు గలుగునో, యాదోషములు ఉత్ఫఉన్నీసాకును కలవు. దానికి మొదటి మగఁడుండెను— అందువలన ఉమ్రా లెవరును దానినిఁ బెండ్లాడ సమ్మతింపలేదు—ఆమెకును వివాహముచేసి కొన నిష్టములేదు. ఆమె తన మనస్సునందు ప్రతికుసుమము నందును విహరించు భ్రమరమును పక్షచ్ఛేదము చేయనేల ? యని భావించెను. మొట్టమొదట కొన్నాళ్లు తెలిసి తెలియక యుండెను. క్రమక్రమముగా కాలిమామయమైన కళంకము ప్రస్ఫుటమాయెను. దానితండ్రి విరక్తుఁడై దానిని యింట నుండి వెడలఁగొట్టెను.

ఉత్ఫఉన్నీసా గోప్యముగా నెవరెవరికి దయ జూపుచుం డెనో యట్టివారిలో యువరాజుగానుండిన సలీముకూడ నొకఁ డై యుండెను. అయినను సలీము, ఎవ్వరి కైనను సరియే కుల కళంకమును గలుగఁ జేసినచో,పక్షపాతములేని తన తండ్రియగు అక్బరుపాదుషా కోపాగ్నికి గుఱియగుదు ననుభీతిచే ఉత్ఫఉన్నీ సను తన జనానాలోఁ జేర్చుటకు భయపడి యుండెను. ఇప్పుడు దానికి అనుకూలత సంఘటించెను. ఎట్లన, రజపుత్రస్థానాధిపతి యైన మానసింహుని చెల్లెలిని సలీము వివాహమయ్యెను. ఆమెయే యాతనికి ప్రధానమహిషి. సలీము ఉత్ఫఉన్నీసను తన మహిషికి ముఖ్య సహచారిణిగాఁ జేసికొనెను. ఉత్ఫఉన్నీసా బాహ్యమున మహిషికి చెలికత్తెగను, పరోక్షమున ఉపపత్నిగను నుండెను.

ఉత్ఫఉన్నీసా మిక్కిలి చాతుర్యముగల స్త్రీ కావున, శీఘ్రకాలముననే యువరాజుయొక్క హృదయాధికారి యగు

నని సులభముగాఁ దెలిసికొనవచ్చును. ఉత్ఫఉన్నీసా, సలీమను చిత్తవృత్తి నెఱింగినదై, తాను సావకాశములేక యథాకాలమున సలీమనునకు పట్టమహిషినగుదునని స్థిరముగా నమ్మి యుండెను. ఈనమ్మకము దాని కొక్కతెకుమాత్రమేగాక రాజధానిలోని జనులందఱు నమ్మి యుండిరి. ఇట్టి ఆశాస్వప్నదశయందా స్త్రీ కాలహరణము చేయుచుండఁగా నిద్రాభంగమాయెను. అక్బరుపాదుషా కోశాధ్యక్షుఁడగు (అత్తిబాద-ఉదౌలా) ఖాజా ఆయిసుయొక్క కూఁతురగు మెహరఉన్నీసా యనునది యవనస్త్రీలలో ప్రధానసుందరిగా నుండెను. ఒకనాఁడాకోశాధ్యక్షుఁడు యువరాజును తక్కిన గొప్ప ఉమ్రావులను దనయింటికి భోజనమునకు బిలిచి యుండెను. ఆదినము యువరాజు మెహరఉన్నీసాను జూచి మరలుగొని వెడలి పోయెను. అనంతర చరిత్రమంతయు లోకులెఱింగి యున్నారు అయినను, మెహరఉన్నీసాను షేరఆఫగానుఁడను నొక్క విక్రమశాలి యగు సేనానాయకునకిచ్చి వివాహము చేయునట్లు నిష్కర్షమై యుండెను. సలీమను, అనురాగాంధుఁడై యావివాహమును దప్పించి తనకు పెండ్లిచేయునట్లు తనతండ్రిని వేఁడికొనియె. తండ్రి సమ్మతింపలేదు. అందుచేత సలీమను ప్రకృతంబున నిరాశుఁడై యున్నవానివలె నుండెనుగాని, నిజముగా నిరాశుఁడై యుండలేదు. షేరఆఫగాను మెహరఉన్నీసాను వరించెను. సలీమను చిత్తవృత్తి మాత్రము ఉత్ఫఉన్నీసాకు చక్కఁగాఁ దెలియును. షేరఆఫగానునకు ఎన్నివిధముల బ్రతుకు తెరవుండినను, సలీము, అక్బరు మరణానంతరము వానింజంపి మెహరఉన్నీసాను పట్టంపుమహిషిగాఁ జేకొనుననియును, తనకాపదవి

సిద్ధించుట దుర్లభమనియును దెలిసికొని తాను సింహాసనారూఢయగునాశను మానివేసెను.

ముసల్మానులయొక్క సమ్రాట్ కులగౌరవము అక్బరు మరణముతో తుదముట్టెను. ఏ ప్రచండసూర్య ప్రకాశము చేత ఆ కులగౌరవము బ్రహ్మపుత్రానది మొదలు హిందూస్థానమువఱకును వ్యాపించియుండెనో, యాసూర్యుఁ డస్తమించెను. ఈసమయంబున ఉత్ఫఉన్నీసా ఆత్మప్రాధాన్యమును రక్షించి కొనుటకై యొక దుస్సాహసికమైన సంకల్పమును జేసెను.

రాజపుత్త్రీపతియగు రాజా మానసింహుని చెల్లెలు సలిమునిప్రధానమహిషియై యుండెను. ఖుస్రుఖాన్ ఆయమ పుత్త్రుఁడు. ఒకనాఁడామెతో ఉత్ఫఉన్నీసా అక్బరుయొక్క దేహాలస్యవిషయమై మాటలాడుచు, నామెను గూర్చి నీవు బాదషాకు భార్యయగు సందర్భము కలుగుటవలన మనుస్సునకు సంతోషమగుచున్నదనియెను. దానికిబదులు ఖుస్రుతల్లి, బాదషాభార్య నగుటేమో జన్మసార్థకమే. అయినను, బాదషాతల్లి నగుట యన్నిటికన్న మేలుగదా యనియెను. దీనిని వినినతోడనే ఉత్ఫఉన్నీసా హృదయము నొక యచింతితమగు నభిసంధి యుదయమై, "అట్లేల గాఁగూడదు? అదియు నీయిచ్ఛాధీనమయ్యే యున్నది?" అనెను. బేగం "అది యెట్లు" నెను చతురయైన ఉత్ఫఉన్నీసా, "నీవు యువరాజ పుత్త్రుఁడగు ఖుస్రునకు సింహాసనము నిచ్చివేయుము. బాదషాకు తల్లివాదు" వనియెను.

బేగం ఏయుత్తరమును జెప్పలేదు. ఆదినమాడినమాటమఱల ప్రస్తావనకు రాలేదు. అయినను, ఆమాట నెవరును

మఱువలేదు. బేగమునకు తనపతికి బదులుగా తనకుమారుఁడు సింహాసనారూఢుఁ డగుట యనభిమతముగా నుండలేదు. మెహరఉన్నీసాయెడలఁ సలిమను కనఁబఱచు చుండిన యనురాగలక్షణములను గాంచి, ఉత్ఫఉన్నీసా కెంత హృదయశూలమైయుండెనో, బేగమునకును అంత హృదయశూలమై యుండెను. మానసింహుని చెల్లెలు, తుర్కీస్త్రీ యాజ్ఞావర్తిన్యైయుండుట కెట్లు సమ్మతించును ? ఉత్ఫఉన్నీసాకుకూడ ఇది యసహ్యముగనే యుండెను. మఱునాఁడు ఉత్ఫఉన్నీసయును, బేగమును పరస్పరముకలిసి యీ ప్రస్తావమును మాటలాడుకొని యిరువురు నొకసంకల్పమును జేసికొనిరి.

సలిమనుని దప్పించి అక్బరు సింహాసనముపై ఖుస్రూను గూర్చుండఁ బెట్టుట యసంభావనీయ మని వారిరువురకును దోఁచలేదు. ఇది యసంభవము కాదని ఉత్ఫఉన్నీసా బేగమునకుఁ జెప్పెను. ఎట్లన, మొగల్సామ్రాజ్యము రజపుత్రుల బాహుబలముచే స్థాపితమైయున్నది. రజపుత్రజాతికి రాజా మానసింహుఁడు శిఖరుఁడై యున్నాఁడు. అతఁడు ఖుస్రూకు మేనమామ కావలయును. మఱియు మహమ్మదీయులలో ముఖ్యుఁడగు ఖాన్ అజం ప్రధాన రాజమంత్రిగా నుండుటయే గాక ఖుస్రూకు కన్యనిచ్చిన మామగా కూడ నున్నాఁడు. వీరిరువురును ప్రయత్నపడిన యెడల వారిని అనువర్తింపక యుండువా రెవరును బ్రదుకరు. వీరు తప్ప మఱెవ్వరును యువరాజుపక్షమునందు లేరు. మానసింహుని యీకార్యమునందు ప్రవృత్తుఁ డగునట్లు చేయుట నీభారము. అజంఖాన్ మొదలగు ఇతర మహమ్మదీయఉమ్రాలను ఈవిషయమున సంబం-

ఘించున ట్లొనర్చుట నాభారము. నీయనుగ్రహామున నేను కృతకృత్యురాలయ్యెదను; అయిన నొకభయము కలదు. ఏమనఁగా, ఖుస్రూసింహాసనారూఢుఁ డైన పిదప, నన్ను దుశ్చరిత్రురాలని అంతఃపురమునుండి వెడలఁగొట్టునేమో యను భయము కలిగియున్నది; అని చెప్పెను.

బేగము, సహచారిణి యభిప్రాయమును దెలిసి, యించుక నవ్వి, "నీవు ఆగ్రాపట్టణమునందు ఏ ఉమ్రావుయొక్క గృహిణి కావలెనని యిష్టపడినను, వానిని నిన్ను పాణిగ్రహణ మొనరించునట్లు చేసెదను; మఱియు, నిన్ను చేపట్టినవాఁ డైదువేల గ్రామంబుల కధికారి (మన్సబుదారు) అగున ట్లొనరింతు" నని యెను.

ఉత్ఫుడున్నీసా సంతుష్టయైనట్లు నటించెను. ఏలన, రాజధానియందు నొకనికి గృహిణిగా నుండినచో ప్రతి పుష్పము నందుచు విహారించు మధుకరిని పక్షచ్ఛేదనము గావించిన ట్లగును. అట్లయిననేమి సుఖముండును? స్వాతంత్ర్యమును త్యజించి బాల్యసఖియగు మెహరఉన్నీసాకు దాసియై యుండుటయందేమి లాభము. అయినను, ఎవఁడేని ముఖ్యుఁడగు ఉమ్రావు గృహిణియై యుండినచో మిక్కిలి గౌరవాస్పదమై యుండునని భావించెను.

కేవల మీ యాశామాత్రముననే ఉత్ఫుడున్నీసా యీ కార్యమునందు ప్రవృత్తురాలు కాలేదు. సలీమను తన్ను ఉపేక్షచేసి మెహరఉన్నీసామీఁద మిగుల మోహముగలిగియున్నాఁడనెడి విరోధమునుకూడ దీర్చుకొనవలయు ననెడి యుద్దేశముతో నీపనియందు బద్ధకంకణ యయ్యెను.

అజంఖానుఁడును, ఢిల్లీయందును ఆగ్రాయందునుగల గొప్ప గొప్ప ఉమ్రాలును, ఉత్ఫఉన్నీసాకు సంబంధించినవారుగా నుండిరి. అజంఖానుఁడు తనయల్లుఁడగు ఖుస్రూకొర్కెని సాధించుట కుద్యుక్తుఁడగుటయం దాశ్చర్యమేమియు లేదు. అతఁడును ఇతరఉమ్రాలును ఈపనికి ఒప్పుకొనిరి. అజంఖానుఁడు ఉత్ఫఉన్నీసాను జూచి, "మన మీకార్యమున కృతకృత్యులముగానిచో, నాకును నీకును మిగుల కష్టముగానుండును. దీనిని చక్కగా ఆలోచించికొనుము; ముందుగనే ప్రాణంబులను రక్షించుకొనుట కుపాయము నాలోచించికొనవలయు" ననెను.

ఉత్ఫఉన్నీసా:—నీయాలోచనమేమి ?

అజంఖాన్:—ఒరిస్సాదేశముతప్ప వేఱే యాశ్రయము లేదు. అచ్చట మొగలాయీలశాసన మంత ప్రచురముగా లేదు. అక్కడిసైన్యమును మనస్వాధీనమున నుంచుకొనవలయును. నీయన్న ఒరిస్సాదేశమున మన్సబ్దారుగా నున్నాఁడు. ఆతఁడు యుద్ధమున దెబ్బలు తిన్నాఁడని రేపుఉదయమున ప్రచురించెదను. ఆ నెపమున నీవు నీయన్నను జూడవలయునని వెడలిపొమ్ము. అచ్చట నేమిచేయవలయునో దానిని చేసికొని శీఘ్రముగా మరలిరమ్ము.

ఉత్ఫఉన్నీసా యీ యాలోచనమున కొప్పుకొనెను. అది ఒరిస్సాకుపోయి వచ్చునపుడు మార్గమునందు పాఠకమహాశయులకు దాని పరిచయమగును.

# పదునేడవ ప్రకరణము

పథాంతము

"భూమౌపతిత్వాతదను తామాలంబ్యోదతిష్ఠతి,
మరణస్థానమజ్ఞాత్వ నిరాశో భ్రామ్యతే నరః."
"చండమారుతహతోపి మనుష్యో
నోజ్ఝతి ప్రకృతిజన్యగుణాంస్తాన్"
"అస్మిన్ దినేనేనిష్ఫలతాభవేచ్ఛే
తత్వః సమ్యగేవ రచయామి నహి త్యజామి"

—నవీనతపస్విని.

మోతిబీబి, లేక, ఉత్పుడున్నీసా, నవకుమారుని విడిచి వర్ధమానాభిముఖియై వెడలెనుగాని, యాదినమువర్ధమాననగరంబును చేరలేదు. మార్గమునందొక గ్రామమునవిడిసెను. ఆనాడు సాయంకాలమున తనదాసి యగు పేష్మనుతో మాటలాడుచు ఉన్నట్లుండి పేష్మన్! నాస్వామి యెట్లున్నాడు?" అని యడిగెను.

పేష్మన్:—విస్మితురాలై, ఎట్లుండవలయును?

మోతిబీబి:—సుందరపురుషుఁడు కాఁడా ?

నవకుమారుని విషయమై దానికి యించుక కోపముగలిగి యుండెను. మోతిబీబి కపాలకుండల కొసంగిన యాభరణములపై దానికి మిగుల ఆశయుండెను. వాని నన్నిటి నొక్కనాఁడు గాకున్న నొక్కనాఁడైనను అడిగి తీసికొనవచ్చునని తలంచియుండెను. ఆతలంపు నిష్ఫలమాయెను. కావున కపాల

కుండలయందును, దాని మగనియందును మిగుల కోపము గల్గియుండెను. కాబట్టి యజమానురాలడిగిన ప్రశ్నకు, "ఆ దరిద్ర బ్రాహ్మణునకు సురూపమేమి; కురూపమేమి? రెండు నొకటియేగదా?" యనియెను.

మోతిబీబి దానిభావమును గ్రహించి నవ్వి; "దరిద్ర బ్రాహ్మణుఁడు ఉమ్రాయైనచో నప్పుడు సుందరపురుషుఁడగునా కాఁడా?" అని యడిగెను.

పేష్మన్:—కాకేమి?

మోతి:—ఖుస్రూ బాదషాయైనచో నాస్వామిని ఉమ్రాగా చేయుదు నని బేగం నాకు మాటయిచ్చిన దెఱుఁగవా?

పేష్మన్:—ఎఱుఁగుదును. అయిన నీ మొదటిమగఁడేల ఉమ్రా కావలయును?

మోతి:—నాకు మొదటి మగఁ డెవఁడు?

పేష్మన్:—ముందుగా నెవఁడు పెండ్లాడెనో వాఁడే.

మోతిబీబి హాస్యముఖియై, నాయట్టి పతివ్రత కిరువురు భర్తలా? అది యన్యాయము; ఆవైపున పోవువా రెవరు? పోవు వా రెవరు? అని యడిగెను.

అచ్చట పోవుచున్న వానిని పేష్మన్ ఎఱిఁగియుండెను. వాఁడు ఆగ్రానివాసియును అజంఖానుని యాశ్రితుఁడునునై యుండెను. వానిం గాంచి యిరువురును విస్మితులైరి. పేష్మన్ వానినిఁ బిలిచెను. వాఁడువచ్చి ఉత్ఫఉన్నీసాకు సలాముచేసి యొకజాబును చేతికిచ్చి, నే నీజాబును ఒరిస్సాకు గొనిపోవుచు న్నాను; ఈజాబు అతిజరూరైనదని చెప్పెను. ఉత్ఫఉన్నీసా

## పదునేడవ ప్రకరణము

జాబును చదివినంతనే యాశయంతయు నిర్మూలమైపోయెను. ఆజాబులో,

"మన ప్రయత్నము విఫలమాయెను. మరణకాల మందుకూడ అక్బరు తన బుద్ధిబలమున మనలం గెల్చి, లోకాంతరంబును జేరెను. యాజ్ఞాబలమున సలిమను ఇప్పుడు జహాంగీరు బాదషా యై యున్నాఁడు. నీవు ఖుస్రూకొఱకు ప్రయత్నపడవలదు. ఇప్పుడు మనముచేసిన ప్రయత్న విషయమై ఎవరైనను మనపై పగబట్టుదురేమో దానిని తప్పించుకొన ప్రయత్నము జరగవలసియున్నది. నీ వెన్నిపను లుండినను త్వరగా ఆగ్రాకు రావలసినది"; అని వ్రాయఁబడి యుండెను.

అక్బరు, ఈప్రయత్నముల నన్నిటిని యెట్లు విఫలముగ జేసెనో, యది దేశచరిత్రమున వర్ణింపఁబడి యున్నది. ఇచ్చట విస్తరభీతిచే మానితిమి.

జాబు తెచ్చినమనుష్యుని ఉపచరించి పంపివేసి, పిమ్మట, పేష్మనుకు జాబును చదివి చెప్పెను.

పేష్మక్:—ఇప్పు డేమియుపాయము ?

మోతి:—ఇప్పు డేమియు నుపాయము లేదు.

పేష్మక్:—(కొంచె మాలోచించి) మంచిది; బాధకమేమి ? ఇతర రాజులకు పట్టంపుమహిషిగా నుండుటకంటె మొగల్ బాదషాకు అంతఃపురస్త్రీగా నుండుట మేలుకదా.

మోతి.—(చిఱునవ్వున);—అది కానేరదు. ఇఁక నేను రాజధానిలో నుండలేను. శీఘ్రకాలముననే మెహరఉన్నీసా బాదషాభార్య యగును. నేను దానిని చిన్ననాఁటనుండి

రొఱుంగుదును. అది యంతఃపురమును జేరినతోడనే యదే బాదషాగా నుండును. నేను, వాఁడు సింహాసనమునకు రాఁగూడదని చేసిన ప్రయత్నము లన్నియుఁ దెలియక పోవునా; అప్పుడు నాయవస్థ యేమగును ?

పేష్మన్:—దుఃఖమును నటించి, "అప్పుడే మగు"నని యడి గెను.

మోతి:—ఒక్క నమ్మకము గలదు. మెహరఉన్నీసా, జహంగీరుని యందుఅనురాగనుుంపక తన పతియిందే యథార్థస్నేహము గలదై యున్నచో,జహంగీరుఁడు నూరుషేరఅఫ్గానునిజంపి నప్పటికిని దానినిపొందఁజాలఁడని దృఢముగానమ్మవచ్చును. అప్పుడు దానిని గట్టిగానమ్మవచ్చును. అట్లుగాక, అది జహాం గీరునిపై అభిలాషిణియై యున్నచో, దానిని నమ్మగూడదు.

పేష్మన్:—మెహరఉన్నీసా చిత్తవృత్తిని దెలిసికొనుట యెట్లు?

మోతి:—(నవ్వి):—ఉత్ఫఉన్నీసాకుఅసాధ్యమైన దేది కలదు? మెహరఉన్నీసాకును నాకును బాల్యస్నేహము. రేపు వర్ధమాన పురంబునకుఁ బోయి దానితోఁగూడ రెండుదినము లుండెదను.

పేష్మన్:—ఉత్ఫఉన్నీసా జహాంగీరునియం దనురాగిణి కాదని తెలిసిన నేమిచేయుదువు ?

మోతి:—నాతండ్రి "క్షేత్రే కర్మవిధీయతే" అని చెప్పియు న్నాఁడు.

ఈ సంభాషణము జరిగినమీఁద నిద్దరు నించుక సేపూరకుండిరి. చిఱునవ్వున మోతియొక్క ఓష్ఠాధరములు కుంచి తేమగుటకారంభించెను. పేష్మన్, ఏలనవ్వెదవు? అనెను.

మోతి:—ఒక నవీనభావము మనంబునకు గోచరమాయెను.
పేష్కా:—ఆనవీనభావ మెయ్యది!

మోతి చెప్పలేదు. మేమును పాఠక మహాశయులకుఁ దెలుపుటలేదు. తుదకు తనంతట ప్రకాశ మగును.

# పదునెనిమిదవ ప్రకరణము

## ప్రతియోగినీ గృహము

"శ్యామాదన్యో నహినహి ప్రాణనాథో మమాస్తి"
—ఉద్ధవదూతము.

ఈ సమయంబున షేరఆఫగానుఁడు బంగాళాదేశపు సుబేదారు అధికారంబునకు లోఁబడి, వర్ధమానపురంబునందు కారాధ్యక్షుఁడై వసించుచుండెను.

మోతిబీబి వర్ధమానంబును జేరి షేరఆఫగానుని యింటియందు విడిసెను. షేరఆఫగానుఁడును అతని భార్యయు దానిని ఆదరించి యింటనుంచుకొనిరి. షేరఆఫ్గానుఁడును వానిభార్య, మెహరఉన్నీసాయును ఆగ్రాయందున్నపుడు మోతిబీబియెడ మిక్కిలి విశ్వాసముగలవారై యుండిరి. మెహరఉన్నీసా మోతిబీబిని అత్యంత ప్రీతితోఁ జూచుచుండెను. వీరిర్వును ఢిల్లీ సింహాసనమును బొందుటయందు ప్రతియోగినులై యుండిరి; ఇప్పు డిద్దఱు నొక్కచోటనే చేరియున్నారు.

మెహరఉన్నీసా భావించుచుండిన దేమనఁగా—బ్రహ్మదేవుఁడు భారతవర్షకర్తృత్వము నెవరి యదృష్టమున వ్రాసియు.

న్నాడో, యది యావిధాతకే తెలియును. మఱియు, ఆ సలి మనసకును దెలియును. మఱెవ్వరికైనఁ దెలియునన్నవో; ఈ ఉత్ఫఉన్నీసాకే తెలియును. వేఱెవ్వరికిని దెలియదు. కాఁబట్టి, ఉత్ఫఉన్నీసా యీవిషయమై ప్రస్తావించునో లేదో? దీని యంతరంగమును పరికించుచు" నని మెహరఉన్నీసా తలంచుచుండెను. అయినను, మోతిబీబి మెహరఉన్నీసా మనస్సును పరీక్షించుటయందు ప్రయత్నపడుచుండెను.

ఆకాలమున మెహరఉన్నీసా భారతవర్షంబు నందంతట సర్వోత్కృష్టసుగు సుందరియనియు, గుణవతియనియు, ప్రఖ్యాతినొంది యుండెను. వస్తుతః అట్టి స్త్రీలు భూమండలమునకొందఱు మాత్రమే పుట్టుదురు. ఇవి సుందరీగుణులలో నెక్కుడు సౌందర్యవతి యని పేరొంది యున్నది. విద్యయం దా కాలమున పురుషులు సహిత మంతటి విద్యావంతులుగానుండలేదు. నృత్త గీతములయందును, కవిత్వమునను, చిత్తరువు పనులయందును అద్వితీయురాలై యుండెను. దాని సరసవాక్కు సౌందర్యమునకన్నను మిన్నయై మోహమును గలుగఁ జేయుచుండెను. మోతిబీబికి కూడా ఈగుణములయం దేమియు గొఱతగా నుండలేదు. ఈచతురమతు లిద్దఱును పరస్పర మొక్కరిమనస్సు నొక్కరు తెలిసికొనుటకు ఉత్సహించుచుండిరి.

మెహరఉన్నీసా తన సొంతమైన విహారమందిరమునఁ గూర్చుండి చిత్రపటములు వ్రాయుచు తాంబూలచర్వణము చేయుచుండెను. ఆపె మోతిబీబిని జూచి, "చిత్ర మెట్లున్న" దని యడిగెను. మోతిబీబి, ౼ మెట్లుండవలయునో యట్లే

యున్నయది. మతెవ్వరును నీవలె చిత్రలేఖనమందు నైపుణి గలవారుగా లేనందులకు వ్యసనపడవలసి యున్న" దనెను.

మెహరఉన్నీసా:—నీవు చెప్పునది నిజమైయున్నచో వ్యసనంబు నకుఁ గారణ మేమి?

మోతిబీబి:—ఇతరులకు నీవలె చిత్రనైపుణ్య ముండియున్నచో నీ ముఖమును ఆదర్శస్వరూపముగా నుంచికొని చిత్రమును లిఖింతురు.

మెహరఉన్నీసా:—గోరీ పట్టిలో నీపాడు ముఖముయొక్క ఆదర్శమున్నది.

ఈ మాటను మెహరఉన్నీసా యించుక గాంభీర్యభావముతోఁ జెప్పెను.

మోతిబీబి:—భగినీ! యీదినము నీమనస్సున కింత విసుగేల? స్ఫూర్తి తగ్గుటకుఁ గతం బెయ్యది?

మెహరఉన్నీసా:—స్ఫూర్తితగ్గినట్లే? లేకున్నచో నీవేల నన్ను విడిచిపెట్టి రేపే వెడలి పోయెదవు? ఇంకను రెండుదినము లుండి నాకు మనస్సంతోషమును జేయఁగూడదా?

మోతిబీబి:—సుఖసంతోష మెవరి కక్కఱలేకుండును? నీవు సుఖసంతోషములయం దాశయుండిన యెడల రేపే పోనే లయని నీవడుగుదు వేమో. నేనేమి చేయుదును? శుద్ధముగా పరాధీనురాలనై యున్నాను. కాన నే నెట్లుండఁ గలను? నీవే చెప్పుము.

మెహరఉన్నీసా:—నాపై నీకు విశ్వాసము లేదు. ఉన్నచో; ఎట్లులైనను నిలువవచ్చును. ఇంతదూరము రానే వచ్చితివి, వచ్చినదానవు పదిపూటలుండి పోరాదాయేమి?

మోతిబీబి:—ఉన్న సంగతిని జెప్పితిని. నా సహోదరుఁడు మొగలాయి సైన్యమున మన్సబ్ దారుఁడై యున్నాఁడు. వాని సమాచారమును విని బేగముయొక్క యనుమతిని వడసి చూచుటకై వచ్చితిని. ఒరిస్సాయందే చాల ఆలస్య మాయెను. ఇంకను ఆలస్యముచేయుట యుచితము కాదు. నిన్నుఁ జూచి చాలదినములైనందున, ఇంతదూరమువచ్చి నిన్నుఁజూడక పోరాదని యెంచి వచ్చితిని.

మెహరఉన్నీసా:—బేగముతో ఎన్నిదినములలో వచ్చునట్లు చెప్పివచ్చితివి?

మోతిబీబి:—మెహరఉన్నీసా పరిహాసము చేయుచున్న దని తెలిసికొనెను. కేవలము అశ్లీలముగాని గుప్తకుచోద్యము చేయుటయందు మెహరఉన్నీసాకంటె మోతిబీబి చతురమతి గాదు. దానివంటి చాకచక్యమును లేదు. అయినను, అది యెంతహాస్యముచేసినను అప్రతిభురాలగుటకుఁ దగినట్లుండ లేదు. అది యడిగినప్రశ్నకుత్తరముగా, "సఖి! మూఁడుమాసములు దారినడిచి పయనముచేయవలసి యున్నపుడు ఇన్నిదినములలో తిరిగివత్తునని యెట్లు నిష్కర్షముగాఁ జెప్పరానగును? అయినను, ఇప్పటికి చాలదినము లాయెను. ఇంకఁ దడసినచో వారి యసంతుష్టికి పాత్రమగుదు ననెడి భయము కల్గి యున్నది" అనిచెప్పెను.

మెహరఉన్నీసా, దాని స్వభావసిద్ధమైన భువనమోహనంబగు నవ్వునవ్వి;"యెవరికి అసంతుష్టి కలుగునను భయము! యువరాజగు సలిమనుని యసంతుష్టికి భయమా! లేక, బేగము యొక్క యసంతుష్టికి భయమా!" యని యడిగెను.

మోతిబీబి, యించుక అప్రతిభయై; "యీ లజ్జాహీన యగు నాకు నింకెంత లజ్జ గలుగఁ జేయవలయు నని యున్న దానవు? ఇరువురకును అసంతుష్టి కలుగును;" అనెను.

మెహరఉన్నీసా:—అయిన నొకమాట నడిగెద; చెప్పుము. "నీవేల బేగం అను బిరుదును ధారణము చేయలేదు? సలిమను నిన్ను వివాహమాడి పట్టంపుమహిషిగాఁ జేయునని వినియున్నాను. ఆమాటనిజమా?"

మోతిబీబి:—నేనేమో పరాధీనురాలను. ఉండెడు కొంచెము స్వాతంత్ర్యమునేల పాడుచేసికొనవలయును! బేగమునకు సహచారిణిగా నున్నందున ఒరిస్సాకు పోతిని. సలిమను యొక్క ఖాసా బేగమైయున్నచో ఒరిస్సాకు బోనగునా?

మెహరఉన్నీసా:—ఢిల్లీశ్వరునకుఁ బట్టంపు మహిషియైన యెడల ఒరిస్సాకు పోవుట కాటంకమేమియున్నది?

మోతిబీబి:—నే నా మహారాజునకు పట్టంపుమహిషి కావల యుననెడు కోర్కి గలదానను గాను. ఈహిందూస్థానమునం దంతట మెహరఉన్నీసామాత్రమే [illegible]రుని ప్రాణేశ్వరి యగుటకుఁ దగినదిగా నున్నది.

మెహరఉన్నీసా మోమువాంచి యించుకసేపునకు, "భగినీ! నామనస్సునకు వ్యథ గలుగఁజేయు మాటను జెప్పినచో నామనోభావము బయలువడునని నీవీమాటను జెప్పితి" వని నేనుభావింపను. అయినను, నిన్ను వేడు కేమనఁగా, "నేను మనోవాక్కాయ కర్మంబులయందును షేరఆఫగానునికుల స్త్రీగానుందును. నీవు దీనిని మఱచి మాటలాడకు" మనియెను.

లజ్జాహీనురా లగు మోతిబీబి యీతిరస్కారమునకు భయపడక, మంచిసమయము దొరకొనియె నని యెంచి; "నీవు పతిగతప్రాణ యని నేను గట్టిగా నమ్మినదానను. అందు వలననే నే నీమాటను జెప్పుటకు సాహసించితిని. సలిమను ఇది వఱకు నీమోహాకరమగు సౌందర్యమును మఱువలేదని చెప్పుటయే నాయుద్దేశముగానున్నది. నీవు ఊఱడిల్లుము. నిన్ను వ్యథపెట్టుటకై చెప్పినదానను గాను.

మెహారఉన్నీసా:—ఇప్పుడు తెలిసినది. అయిన, నేనేల భయం పడ వలయును?

మోతిబీబి:—(వెనుక ముందు జూచి) వైధవ్యము సంభవించునని భయపడవలయును.

ఈ మాటను జెప్పి మోతీబీబి మెహారఉన్నీసా ముఖమును తీక్ష్ణదృష్టితోఁ జూచెను. అయిన నామఖభావమునఁ భీతిగాని, యాహ్లాదముగాని, యేదియుఁ దోఁచలేదు.

మెహారఉన్నీసా కేవలదర్పమున "వైధవ్యభయమా! షేరఆఫగానుఁడు తన యాత్మసంరక్షణను జేసికొనఁజాలనంతటి వ్యర్థుఁడుగాఁడు. అదియునుంగాక, అక్బరుబాదషా రాజ్యమున నతనికొడుకులు పరుల ప్రాణంబులను హరించినమీఁద బ్రతుకలేరు. అని చెప్పెను.

మోతి:—నీవుచెప్పునది నిజము. అయినను, ఇప్పుడు అక్బరు గతించె ననియును, సలిమను సింహాసనారూఢుఁడై యున్నాఁడనియును, ఆగ్రాయందు వర్తమానము పుట్టినది. ఇఁక ఢిల్లిశ్వరుని దండించువా రెవరు?

మెహారఉన్నీసా నిశ్చేష్టితురాలయ్యెను. దాని సర్వాంగములును భీతిచేఁ గంపింప నారంభించెను. వాడినమోము గలదాయెను. నేత్రములయం దశ్రుధార లొలుకుచుండెను. మోతి, "ఏల యేడ్చెదవు" అని యడిగెను.

మెహారఉన్నీసా నిట్టూర్పు నిగిడించి; సలిమను భారత వర్ష సింహాసనమున నుండువఱకు నాగతి యేమగునో యని గద్గదకంఠయై పల్కి మఱియు నిట్లనియె. "చెలీ! వినుము. ఆకస్మికముగా మనఃకవాటము భేదిల్లెను. నీవుమాత్రము నాయింగితము నెఱింగితివి. ఇది యితరుల చెవిని సోఁకగూడదు, నాయాన" అనియె.

మోతి, "అటులనే కానిమ్ము. దీని నెవరికిం జెప్పను. అయినను, సలిమను నేను వర్ధమానంబునకుం బోయివచ్చితిననివిని నచో నతఁ డవశ్యముగా మెహారఉన్నీసా యేమిచెప్పినదని యడుగును. వానికేమని చెప్పుదును" అని యడిగెను.

మెహారఉన్నీసా యించుకసే పాలోచించి, "నేను ఆతనిని నాహృదయమధ్యమున నెల్లప్పుడును ధ్యానించుచున్నాననియును, అవశ్యమున్నచో నతనికొఱకై ప్రాణంబులను సహితమర్పించుటకు సిద్ధముగ నున్నాననియును జెప్పుటయే గాక, కులమర్యాదను మాత్రము సమర్పింపఁ జాలననియును, మగఁడు జీవించియుండువఱకును ఢిల్లీశ్వరునకు ముఖమును జూపఁజాలననియును, ఒకవేళ ఢిల్లీశ్వరునివలన నాస్వామికి ప్రాణాపాయము సంభవించినచో స్వామిఘాతుకునితో నే నీ జన్మమునఁ జేరఁజాలననియును జెప్పు" మనెను.

ఇట్లు చెప్పి మెహరఉన్నీసా లేచిపోయెను. మోతీబీబి చమత్కృతురాలాయెను. అయినను, మోతియే జయించినది మెహరఉన్నీసా మనోభావమును మోతి తెలిసికొనినదేగాని మోతిమనోభావమును మెహరఉన్నీసా తెలిసికొనక పోయెను ఎవతె తన బుద్ధిప్రభావంబున ఢిల్లీశ్వరుని ఈశ్వరియై యుండెనో యదిమోతిబీబిచే పరాజితురాలయ్యెను. దీనికి హేతువేమనఁగా, మెహరఉన్నీసా ప్రణయశాలినిగా నుండెను. మోతిబీబి స్వార్థపరురాలై యుండెను.

మోతిబీబి మనుష్యహృదయముయొక్క విచిత్రగతిని చక్కఁగాఁ దెలిసికొనుతెలివిగలది. అది మెహరఉన్నీసా మాట విని దానిపై నాలోచించి యేసిద్ధాంతము జేసినదో, అదియే ముందు యథార్థ మాయెను. ఎట్లన గా, మెహరఉన్నీసా జహాంగీరునిపై యథార్థముగా అనురాగిణియనియును, అది స్త్రీలకుఁ గల సహజదర్పంబున నేమిపల్కినప్పటికిని మార్గము చక్కపడినప్పుడు మనోగతిని నిరోధింపదనియును, బాదషా మనోభీష్ట మవశ్యము సిద్ధించుననియును సిద్ధాంతముచేసెను.

ఈ సిద్ధాంతమువలన మోతిబీబి యాశాపాశంబు లన్నియు నిర్మూలమై పోయెను. అయినను, అది దుఃఖితురాలు కాలేదు. ఇంచుక సుఖానుభవమే గలిగెను. అయినను, ఇట్టి యసంభవమైన చిత్తప్రఫుల్లతకల్గినదానికిఁగారణము మొదట తెలియదు. అది ఆగ్రాకు పోవుచుండఁగా దారియందు దానికి తనమనోభావము తనంతట స్ఫురించెను.

# పంచోస్మిదవప్రకరణము

**రాజనికేతనము**

"ఇతఃపరంత్వం భార్యామితిమాభజస్వ".

—వీరాంగనాకావ్యము.

మోతిబీబి ఆగ్రాకు పోయి చేరెను. ఇఁక ముందు దానిని మోతి యని పిలువరాదు. కొన్నిదినములలోనే దాని చిత్తము శుద్ధముగా పరివర్తిత మయ్యె.

పోయి జహాంగీరుని జూచెను. జహాంగీరు పూర్వము వలెనే దానిని అత్యాదరమునజూచి దాని సహోదరుని సమాచారమును దాని యోగక్షేమంబును విచారించెను. ఉత్ఫఉన్నీసా మెహరఉన్నీసాతో నేమి చెప్పియుండెనో యదేవిధముగ జరిగెను. యోగక్షేమ సమాచారములన్నియు ముగిసిన మీఁద "నీవు వర్ధమానంబున రెండుదినము లున్నట్లు చెప్పితివి కదా? మెహరఉన్నీసానావిషయమై యేమిచెప్పినది" అని యడిగెను.

ఉత్ఫఉన్నీసా కపటములేక, అది వానియం దనురాగము కలదై యున్నదని చెప్పెను. బాదషా విని యూరకుండెను. వాని నేత్రములనుండి యొకటి రెండు జలకణంబులురాలెను.

ఉత్ఫఉన్నీసా:—జహాపనా! (మహాస్వామీ!) ఈదాసి శుభవార్తను దెచ్చిచెప్పెను. అయినను, దాని కేమియు పురస్కార మీయలేదు.

బాదషా:—(నవ్వి) బీబీ! నీయాశ యపరిమితమైనది.

ఉత్ఫఉన్నీసా:—జహాపనా ! సేవకురాలి దోషమేమి ?

బాదషా:—ఢిల్లీబాదషాను నీయొక్క గులాముగాఁ జేసికొని యున్నావే. మరల పురస్కార మేమి కావలయును ?

ఉత్ఫఉన్నీసా:—(నవ్వి) స్త్రీల కమితయాశ యని యెఱుఁగరా ?

బాదషా:—మఱేమి నీయాశ ?

ఉత్ఫఉన్నీసా:—నను కోరినప్రకార మిచ్చునట్లు సెలవొసంగుఁడు. తర్వాత చెప్పెదను.

బాదషా:—రాజకార్యంబునకు భంగకరము కాకున్న నిత్తును.

ఉత్ఫఉన్నీసా:—(నవ్వి) ఒక్క తెకొఱకు ఢిల్లీశ్వరుని కార్యము భంగమగునా ?

బాదషా:—అటులైన సమ్మతమే! నీకోర్కి యేమి ? తెల్పుము.

ఉత్ఫఉన్నీసా:—వివాహము చేసికొనవలయు నని యిచ్ఛ గలిగినది.

బాదషా:—(పకపకనవ్వి) ఇది నిజముగ క్రొత్తయాశయే, సంబంధ మెచ్చట నిర్ధరింపఁబడినది ?

ఉత్ఫఉన్నీసా:—అదేమోనిష్కర్షయైనది; రాజాజ్ఞమాత్రము కావలసియున్నది. రాజుగారికి సమ్మతి లేనియెడల నేసంబంధమేర్పడియుండినను ప్రయోజనము లేదు.

బాదషా:—నాసమ్మతియేల ? ఎవ్వరిని సుఖసాగరమున ముంచి తేల్పవలయునని తలంచియున్నదానవు ?

ఉత్ఫఉన్నీసా:—దాసురాలు ఢిల్లీశ్వరుని సేవచేసియుండుట

వలన ద్విచారిణి కాఁజాలను. ఈదాసి నాస్వామినే వివాహాముచేసికొనవలయునని తలంచియున్నది.

బాదషా:—అది నిజమేగాని యీపురాతన నఫరు (మనుష్యుఁడు) అగు నాగతి యేమికావలయును?

ఉత్ఫఉన్నీసా:—ఢిల్లీశ్వరి యగు మెహారఉన్నీసాకు అప్పగింపఁబడవలయును.

బాదషా:—ఢిల్లీశ్వరి యగు మెహారఉన్నీసా యెవతె?

ఉత్ఫఉన్నీసా:—ముందు రాఁబోవునది.

మెహారఉన్నీసా ఢిల్లీశ్వరి యగునని ఉత్ఫఉన్నీసా దృఢముగా నమ్మియున్నదనియు, తన మనోభీష్టము విఫలమగుచున్నదనెడి కోపముచే రాజావరోధమునుండి వెడలిపోవుటకై యీరీతిగా తన యనుమతిని వేఁడుచున్నదనియు బాదషా భావించెను.

ఇట్లు చింతించినవాఁడై దుఃఖముతో నూరకుండెను. ఉత్ఫఉన్నీసా, "మహారాజుగారికి నేను ప్రార్థించినది సమ్మతము లేదా?" యనియెను.

బాదషా:—నాకు సమ్మతము లేకపోలేదు. అయినను, మగనితో మరల వివాహాము చేసికొనవలసిన ఆవశ్యక మేమి?

ఉత్ఫఉన్నీసా - దౌర్భాగ్యమువలన ప్రథమవివాహకాలమందు స్వామి నన్ను పత్నిగా గ్రహింపలేదు. ఇప్పుడు మహారాజులు దాసి యగు నన్ను త్యజింపలేరని తోఁచుచున్నది.

బాదషా:—లోలోన నవ్వినవాఁడై గంభీరభావముతో "ప్రేయసీ! నేను నీకియ్యఁగూడని దేదియులేదు. నీకు, అట్టి

కోరికగలదేని యత్నీచేయుము. అయిన, నన్నేల విడిచిపోవలయు ? ఒక్కయాకాశంబున సూర్యచంద్రు లిరువురును ప్రకాశించుచుండలేదా? ఒకే గుచ్ఛమున రెండుపుష్పములు పూచుటలేదా? అనియెను.

ఉత్ఫఉన్నీసా, విస్ఫారితము లగు చక్షువులచే బాదషానుజూచి "చిన్నచిన్న పుష్పంబులు పూయును; అయిన నొకే మృణాళంబున రెండు పద్మములు కలుగవు. తమ రత్నసింహాసనము క్రిందిభాగమున నేను ముల్లువలె నేల యుండవలయును? అనియెను.

ఇట్లనిచెప్పి, ఉత్ఫఉన్నీసా తనగృహంబునకు వెడలిపోయెను. దాని కీయాశ యెందులకై జనించెనో, దానిని బాదషాతో చెప్పలేదు. దానియాంతర్యమును దెలియఁజాలక పోయెను. ఉత్ఫఉన్నీసా హృదయము పాషాణమయంబుగనుండెను. సలిమనుయొక్క రమణులహృదయంబును జయించెడు రాజకాంతిసహితము దానిమనస్సును లీనముచేయులేదు. అయినను, ఇప్పుడు పాషాణమధ్యమున కీటకము ప్రవేశించెను.

# ఇరువదవ ప్రకరణము

## ఆత్మమందిరము

"జన్మారభ్యమయా విచిత్రమతులంరూపం పునఃప్రేక్షితం
నేత్రద్వంద్వమతృప్తం......................".
"శ్రావ్యంగీతమశుశ్రువం శ్రవణయోశానందహీనంయథా".

"శతసాహస్రరసికై రనుయాతంమువాస్సవాః,
చిత్తంనతోపమగమ ద్యేకేనపురుషేణ యత్."
"నిరానందామయానీతా యామిన్యో నేకసంఖ్యకాః".

ఉత్ఫఉన్నీసా తనగృహంబునకువచ్చి ప్రఫుల్లాననయై పేష్మనిం బిలిచి, నాయొక్క సువర్ణముక్తాదులచే ఖచితమైన వస్త్రంబులను తీసికొమ్మనియెను.

పేష్మన్, "ఈపోషాకు నాకేల? ఈదినము జరిగిన సమాచారమేమి?" యనియడిగెను.

ఉత్ఫఉన్నీసా:—మిగుల మంచి సమాచారమే.

పేష్మన్:—అట్లయిన, మెహారఉన్నీసాకు భయముతప్పెనని దోఁచుచున్నది.

ఉత్ఫఉన్నీసా:—తప్పెను. ఆవిషయమై చింతలేదు.

పేష్మను అత్యంతాహ్లాదమును ప్రకాశింపఁజేసి అట్లయిన నేను బేగంగారి దాసినైతి ననియెను.

ఉత్ఫఉన్నీసా:—బేగమునకు దాసి కావలయు నని నీకు కోర్కెయున్నచో మెహారఉన్నీసాతో నీయభీష్టమును చెప్పెదను.

పేష్మన్:—అదెట్లు? ఇప్పుడు నీవు చెప్పుటవలన మెహారఉన్నీసా బాదషాయొక్క బేగముగా నేర్పడు సంభవము లేదని చెప్పితివికదా?

ఉత్ఫ:—నేనట్లు చెప్పలేదు. నా కావిషయమై చింతలేదని చెప్పితిని.

పేష్మన్:—చింతలేక మఱేమి? నీవు ఆగ్రాయం దేకమాత్రాధీశ్వరివి కాకయుంటివేని సర్వమును నాశమగును.

ఉత్ఫ:—ఇంకముందు ఆగ్రాసంబంధము నుంచికొనుట లేదు.

పేష్మ:—ఏల? ఈదినము మిగులమంచి సమాచార మని చెప్పినమాట కర్థమును వేతేమని గ్రహింతును?

ఉత్ఫ:—ఆసమాచార మేమనఁగా—నేను ఆగ్రాపట్టణమును విడిచి మరల ఈజన్మమున నచ్చటికి వచ్చుట లేదనుటయే మిగులమంచి సమాచారము.

పేష్మ:—ఎచ్చటికిఁ బోయెదవు?

ఉత్ఫ:—బంగాళాదేశమునకుపోయి యచ్చట వాసముచేయు దును. సాధ్యపడినచో సద్వంశస్థునికి గృహిణినయ్యెదను.

పేష్మ:—ఇదేమో నాకు క్రొత్తగాను హాస్యముగానున్నది. అయినను నా మేను వణఁకుచున్నది.

ఉత్ఫ:—నేను హాస్యముచేయను. నిజముగా ఆగ్రానువిడిచి వెడలిపోయెదను. బాదషా అనుమతిని బడసివచ్చియున్న దానను.

పేష్మ: ఇట్టి చెడ్డప్రవృత్తి నీకేలకల్గెను?

ఉత్ఫ:—చెడ్డప్రవృత్తి కాదు; నేను ఆగ్రాయందు బహుకాలము అల్లాడితిని. తుదకు వచ్చినఫలమేమి? సుఖతృష్ణ బాల్యావధి మిగుల ప్రబలమై యుండెను. ఆ తృష్ణాపరితృప్తి కొఱకు వంగదేశమును విడిచి యింతదూరము వచ్చితిని. ఈ రత్నమును గొనుటకై నే నెంతధనమును పాడుచేయ లేదు! ఏదుష్కర్మమును చేయక మానితిని? ఏయుద్దేశ్యముకొఱకింతదూరము కృషిచేసితినో, అందేదియు చేతికిఁ జిక్కకపోయెను. ఐశ్వర్యము సంపద ధనము గౌరవము ప్రతిష్ఠ వీనినన్నిటిని చాలినంతవఱకుఅనుభవించితిని. ఇందు

వలసనైనదేమి? ఈదిన మిక్కడనే కూర్చుండి కడచిపోయిన దినములను జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని గణనచేసి చూచినచో నొక్కదినమైనను తుదకొక్కముహూర్తమైనను సుఖ భోగము లనుభవింప లేదని చెప్పఁగలను. ఎప్పుడును పరి తృప్తికాలేదు. తృష్ణ యధికమగుటయేతప్ప మఱేమియు లేదు. ప్రయత్నపడినచో నింకను అధికములైనసంపద లను సంపాదింపఁగలను. అదేల? వీనియందంతయు సుఖ ముండిన, నేనొక్కదినమైనను సౌఖ్యమొందియుందును. ఈసుఖాపేక్ష పర్వతమునంబుట్టిన నిర్ఝరిణివలె నున్నది. మొదట నిర్మలమగుజలము స్వల్పధారగా విజనప్రదేశం బునఁ బ్రవహించితనగర్భమునఁ దానే దాఁచికొని యెవరి కినిఁ దెలియక తనకుతానే కలకలధ్వని జేయును. దానినెవ్వ రును వినుటలేదు. మరలగాలివీచి తరంగము బుట్టుచున్నది. క్రమముగాసాగరమునందు కలియుచున్నది. ఆసాగర హృదయము జలచరములగు మకరకుంభీరముల కావాసము. మఱియు లవణమయమై లెక్కింపనలవిగాని యిసుక దిన్నె లును, మరుభూములును బ్రకాశించుచుండును. ప్రవాహ వేగము తగ్గిపోయినతర్వాత నిర్మలజలమంతయు కర్దమ మయమైపోవును. అట్లే నదీసదృశమైన నాశరీరము ప్రపంచ మనెడి మహాసాగరంబునం దెచ్చట నంతర్హితమగునో యెవరు చెప్పఁగలరు?

పేష్మ ౯!—నాకీ పురాణకథ తెలియదు. సకలసంపదలుండియు నీకు సౌఖ్యము లేకపోనేల?

ఉత్ఫు:—ఏల కలుగలేదనునది యిన్నిదినములకు దెలియ

వచ్చెను. మూఁడేండ్లకాలము రాజప్రాసాదచ్ఛాయయందు గూర్చుండి యనుభవింపని సుఖమును ఒరిస్సానుండి మరలి వచ్చినప్పు డొకనాటి రాత్రియం దట్టిసుఖము గలిగెను. దానివలన తెలిసికొంటిని.

పేష్మ:—ఏమి తెలిసినది?

ఉత్ఫ:—నే నిదివఱకును హిందువుల దేవమూర్తివలె బయట సువర్ణరత్నా ద్యలంకృతనై లోపల పాషాణమయనై యుంటిని. ఇంద్రియ సుఖాన్వేషణమం దగ్నిమధ్యంబున సంచరించితిని. ఎప్పుడును అగ్నిని తాఁకలేదు. ఇప్పు డీపాషాణమధ్యమున రక్తనాడీవిశిష్టమగు సంతఃకరణ మున్నదా యని వెదకుచున్నాను.

పేష్మ:—ఇది యేమో నాకొక్కటియు దోఁచలేదు.

ఉత్ఫ:—నే నీయాగ్రాపట్టణమున నెవ్వరినైన నెప్పుడైనను ప్రేమించితినా?

పేష్మ:—(మెల్ల మెల్లగా) ఎవ్వరిని ప్రేమింపలేదు.

ఉత్ఫ:—అటులైన, పాషాణముగాక మఱేమి?

పేష్మ:—ఇప్పుడు ప్రేమింప వలయునన్నచో కాఁగూడదా యేమి?

ఉత్ఫ:—ఇష్టమేమోకలదు. దానికొఱకే ఆగ్రానువిడిచి వెడలి పోయెదను.

పేష్మ:—దానిచే ప్రయోజనమేమి? ఆమోటుజాతివారుండు దేశమునకు పోనేల? ఆగ్రాయందు మనుష్యులు లేరా? నిన్నెవఁడు ప్రీతితోఁ జూచునో వానినే నీవు ప్రీతితోఁ జూడరాదా? రూపమున; ధనమున; ఐశ్వర్యమున; అన్ని

టియందును బలిష్ఠుఁడై యుండు ఢిల్లీశ్వరునికన్నను పృథ్వి యందెవరు అధికులున్నారు?

ఉత్ఫు:—ఆకాశమునఁ జంద్రసూర్యు లుండియును జలము అధోగామిన్యై పోవుటేల ?

వేష్మఁ:- -ఏల?

ఉత్ఫు:—తలవ్రాత.

ఉత్ఫఉన్నీసా అన్ని విషయములను విశదముగాఁ జెప్ప లేదు; పాషాణమధ్యమున అగ్ని ప్రవేశించియుండెను. పాషా ణము కరుగుచుండెను.

# ఇరువదియొకటవ ప్రకరణము

## చ ర ణ త ల ము

"మనోవాక్ప్రాణకాయాదీ సర్పయామి తవాధునా,
రాజభోగామయాభుక్తాః దాసీభిఃసహా మేళనాత్."

—వీరాంగనా కావ్యము..

క్షేత్రంబున బీజముపడినచోఁ దనంతనే యంకురమగు మన్నది. అంకుర మెప్పుడు సంభవించునో యది యెవరికినిగో చరింపదు. ఎవరును జూడఁజాలరు. అయిన నొకతూరి బీజము డినచో దానిని పడవేసినవా రెచ్చటనుండినను, ఆయంకు రము క్రమముగా వృక్షమై తలయెత్తును. వృక్షము జానెడు పొడవుండినపుడు కంటబడినను, అది యెదుగుటను లక్ష్యపె ట్టరు. క్రమముగా నూపుగింజప్రమాణము వృద్ధియగుచుం

డును. ఒకమూరెడగును; రెండుమూరలగును. అయినను, ఆచెట్టువలన స్వార్థసిద్ధి లేనివారెవరును దానినిజూడరు. దాని వృద్ధిక్షీణముల చింతయునుండదు. దినములు, మాసములు, వత్సరములు గడచిపోవును. దానిపై దృష్టిప్రసరించును; అనఁగా, చెట్టు గొప్పదైయుండును. దానినీడవలన నితరవృక్షములు నష్టమగుచుండును. అప్పుడన్ని చెట్లునశించి, యొక్క చెట్టు మాత్రమే మిగిలియుండును.

ఉత్పలఉన్నీసాయొక్క ప్రణయము నిట్లే వృద్ధియగుచుండెను. అది ఆకస్మికముగా నొక్కదినము ప్రణయభాజనుని గాంచెను. అంతరంగము ప్రణయ మిట్టిదనియెఱుఁగకుండెను. అయినను, అప్పుడే అంకురించెను. మరల ప్రణయభాజనుని సందర్శనము కాలేదు. చూడకుండినను మరి యాముఖమండలము మనస్సున కెదురుగా కన్పడుచుండెను. స్మృతిపటమునం దాముఖమండలముచిత్రితమగుచుండఁగాఁ దనకు చాల సుఖప్రదమైయున్నట్లు బోధమగుచుండెను. బీజమునం దంకురముపుట్టెను. ఆమూర్తిపై అనురాగము జనించెను. మనోధర్మమేమనఁగా; ఏదైనను మనోవ్యాపారము మొదటఁబుట్టి ఆవృత్తియగుట కారంభించి, యది హెచ్చినకొలఁది మనస్సు ఆవ్యాపారమునందే ప్రబల ప్రవృత్తిగలది యగును. పిమ్మట, అది స్వభావసిద్ధమైన మనోవ్యాపార మగును. ఉత్పలఉన్నీసా రేలుంబవళ్లు ఆమూర్తినే మనస్సున భావించికొనుచుండినదే గాక దర్శనాభిలాషయుఁ గల్గెను. మఱియు, దాని సహజమగు స్మృతిప్రవాహము హెచ్చుచుండెను. దానికి ఢిల్లీసింహాసన లాభము, పేలవ మయ్యెను. రాజ్యము, రాజధాని, రాజసిం

హాసనము మొదలగువాని నన్నింటిని విసర్జించి మనస్సు ప్రియుండైనవానిం జూచుటకై పరుగిడ నారంభించెను. ఆప్రియుఁడు నవకుమారుఁడే.

ఈకారణమును బట్టియే ఉత్ఫఉన్నీసా, మెహరఉన్నీసా మాటలను వినినప్పటికిని అసంతుష్టినొందలేదు; ఆగ్రాకువచ్చి తనసంపదలను గాపాడు కొనుటకుఁ బ్రయత్నింపలేదు; బాదషాయొద్ద కట్టకడపటి యనుజ్ఞవడసి వచ్చినది.

ఉత్ఫఉన్నీసా సప్తగ్రామంబునుజేరి యచ్చట రాజవీథికిఁ గొంచెముదూరమున నగరమధ్యమునందలి యొక గొప్పమేడను తనవాసగృహముగాఁ జేసికొనియెను. వీథియందు పౌరుజనులు, ఉన్నట్లుండి యీమేడలో సువర్ణఖచితమైన వసనభూషితులాంద్రగు పెక్కండ్రు దాసదాసీ జనులను గాంచి యాశ్చర్యపరవశులైరి. ఒక్కొకగదియు నతిరమణీయముగా నలంకరింపఁబడెను. ఎక్కడ జూచినను గంధద్రవ్యములు, పన్నీరు, కుసుమదామంబు లామోదమును గలిగించుచుండెను. వెండి బంగారు గజదంతము మొదలగువానిచే నిర్మితమైన గృహశోభార్థములగు నానావిధ వస్తువిస్తులంబు లన్నిదిక్కుల యందును బ్రకాశించుచుండెను. ఈవిధముగా నలంకృతంబగు నొక గదియందు ఉత్ఫఉన్నీసా అధోవదనయై కూర్చుండి యుండెను. మఱియొక ప్రత్యేకాసనంబున నవకుమారుఁడు కూర్చుండి యుండెను. సప్తగ్రామంబున ఉత్ఫఉన్నీసా నవకుమారుని నొకటి రెండు మారులు జూచియుండినప్పటికిని దాని మనోరథ మెంతమాత్రము సిద్ధించుననునది యీదినమే వ్యక్తమయ్యెను.

నవకుమారుఁడు కొంచెముసే పూరకుండి, యనంతరము "అట్లైనచో నే నిప్పుడే వెడలిపోయెదను; నీవు ఇఁకముందు నన్ను బిలువనంపకుము" అని చెప్పి లేచెను.

ఉత్పలఉన్నీసా, "పోవలదు. ఇంకొకమాట చెప్పవలసి యున్నది, నేను చెప్పవలసిన దంతయు నీకును చెప్పి ముగింపలేదు," అనినది.

నవకుమారుఁడు కూర్చుండెను. ఉత్పలఉన్నీసా యేమియుఁ జెప్పలేదు. పిదప, నవకుమారుఁడు "ఇంకేమి చెప్పవలయును" అనెను. ఉత్పలఉన్నీసా ప్రత్యుత్తరమేమియు నీయలేదు. అతి విషణ్ణవదనురాలై కన్నీరు కార్చుచుండెను.

నవకుమారుఁడు లేచెను. ఉత్పలఉన్నీసా లేచి వాని కొంగును బట్టుకొనెను. నవకుమారుఁ డించుకవిరక్తుఁడై; "చెప్పవేమి?" అని యడిగెను.

ఉత్పలఉన్నీసా:—నీవేమి యపేక్షింతువు? పృథ్వియందు నీకు ప్రార్థనీయమైనదేదియు లేదా? ధనము, సంపద, మానము, ప్రణయము, హాస్యము, రహస్యము, ఇత్యాదులు భూమియందు ఏవేవి సుఖమని చెప్పుదురో వానినన్నిటిని ఇచ్చెదను. దానికిం బ్రతిగానీ వేదేని యీయవా? కేవలము నీదాసి కావలయు నని యపేక్షించుచున్నాను. నీకు నేను పత్ని కావలయు నను గౌరవము నీయుమని వేఁడుదానను గాను; కేవలము నీదాసిగా నుండవలయునని మాత్రము వేఁడెదను.

నవకుమారుఁడు:—నేను దరిద్ర బ్రాహ్మణుఁడను. ఈజన్మమున

దరిద్ర బ్రాహ్మణుఁడుగానే యుండెదను. నీసంపద కాసించి జారుఁడను గానేరను.

యవనజారిణిని నవకుమారుఁ డిదివఱకు తనపత్నియని యెఱుంగఁడు. ఉత్ఫుఉన్నీసా అధోవదనయై యుండెను. నవకుమారుఁడు దానిచేతినుండి కొంగును బలవంతముగా విడిపించుకొనెను. అది మరల కొంగును బట్టుకొని, "దైవసంకల్పమెట్లున్నదో యట్లే యగును. నాతలంపును అతల జలంబునఁ గలిపెద. ఇంకేమియు నేనడుగను. అయిన, నీవు ఒకటిరెండు దినముల కొక్కమాత్రైన నీ వీథిని బోవుచుండవలయును. నే నప్పుడు నిన్నుం గని యొకటి రెండు మాటలాడి నీదాసినని భావించికొని నేత్రోత్సవమునైన బొందెద ననియెను.

నవకుమారుఁడు:—నీవు యవనస్త్రీవి, పరవనితవు, నీతో మాటలాడుట సహితము దోషము, నేను మరల నిన్నుం జూడనోపను.

ఇట్లని నవకుమారుఁడు చెప్పఁగానే ఉత్ఫుఉన్నీసా, అవనతాననయైనది; దాని హృదయంబున ప్రబలమగు చండమారుతము వీచుచుండెను. చిత్తరువుబొమ్మవలె ముగ్ధయై నిలువంబడి నవకుమారుని కొంగును విడిచి పెట్టి పొమ్మనియెను.

నవకుమారుఁ డొకటి రెండడుగు లెత్తిపెట్టినాఁడో లేదో, అంతలో ఉత్ఫుఉన్నీసా, గాలిచే వేరుతో పెల్లగిలి క్రిందపడిన మ్రానివలె నతనిపాదంబులపై వ్రాలి బాహులతచేఁ జరణయుగళంబును బంధించికొని, ఆర్తస్వరమున "నిర్దయుఁడా! నీకొఱకేను ఢిల్లీసింహాసనమునుగూడ విడిచివచ్చియున్నాను నీవు నన్ను పరిత్యజింపవలదు." అని చెప్పెను.

నవకుమారుఁడు:- నీవు మరల ఆగ్రాకుపో. నాయాశను విడువుము. ఈజన్మమునఁ గాదు.

ఉత్ఫఉన్నీసా బాణమువలె లేచినిలిచి, దర్పముతోఁ గూడిన భావంబుతో నేను "ఈజన్మమున నీయాశను విడువను" అనిచెప్పి, యించుక తలవాంచి, యనిమిషలోచనయై తన విశాలనేత్రములతో నవకుమారునిఁ జూచుచు రాజరాజమోహినియై నిలిచెను. హృదయాగ్ని యందు కరఁగి పోయి దాఁగ నసాధ్యమైయున్న యా గర్వానలము మఱలఁ బ్రజ్వలింపసాగెను. భారతరాజ్య శాసనాకల్పనయందు భీతిఁ గొనని యామానసికశక్తి మఱల ప్రణయంబున దుర్బలమై యుండిన యాదేహంబున సంచలించెను. లలాట దేశమునం గల నాళము లన్నియు స్ఫీతమై రమణీయంబైన రేఖాకారమును దాల్చెను. జ్యోతిర్మయంబగు నేత్రంబులు రవికిరణంబులచే వెలయు సముద్రజలమువలె చలింపఁదొడంగెను. నాసాపుటములు కంపితమగుట కారంభించెను. ప్రవాహవిహారిణియగు రాజహంసి గతినిరోధకారి కెదురైన యెట్లు గ్రీవాభంగియై నిలచునో, కాలుసోఁకిన నాగమెట్లు ఫణము నెత్తికొని నిలుచునో, అట్లు ఉన్మాదినియగు యవనస్త్రీ మస్తకము నెత్తి "ఈజన్మమున కాదా?, నీవు నావాఁడవే కదా ?" అనియెను.

ఆకోపచిత్తయగు ఫణినీమూర్తిని చూచుచు జూచుచు నవకుమారుఁడు భీతి గొనెను. ఉత్ఫఉన్నీసాయొక్క సుందరమైన దేహమహిమను వాఁ డప్పుడు జూచిన ట్లెప్పుడును జూచియుండలేదు. అయినను, ఆకాంతి ఉఱుమును సూచించు మెఱుపువలె మనోమోహరమై యుండెను వాఁడు వెడలి

పోవుటకు సిద్ధమైనపు డాకస్మికముగా వాని మనస్సునకొక తేజోమయమైన మూర్తి ప్రకాశించెను. ఒక్కనాఁడు నవకుమారుఁడు వాని మొదటిభార్యపై కోపించి శయ్యాగృహముసుండి దానిని తఱుమఁగొట్టనుద్యుక్తుఁడాయెను. పంద్రెండేండ్ల యా యబల దర్పముతో వానిప్రక్కకుఁ దిరిగి నిలిచెను. అప్పుడు దాని నయనంబు లిట్లే ప్రదీప్తమై యుండెను. ఇట్లే లలాటము రేఖావికాసమై యుండెను; ఇట్లే నాసాపుటము కంపితమైయుండెను. ఆ యాకారమును మఱచి బహుకాలమైనది. ఇప్పు డది జ్ఞాపకమునకు వచ్చెను. సాదృశ్యానుభవము కలిగెను. సంశయపరాధీనుఁడై నవకుమారుఁడు సంకుచితస్వరంబున మెల్లమెల్లఁగా, "నీవెవరు?" అని యడిగెను.

యవనయువతీ నయనతారకలు మఱింత విస్ఫారితములై "నేను పద్మావతి"అని చెప్పిన కుమారునిమాటను నిరీక్షింపకయే స్థానాంతరంబునకు పోయెను. నవకుమారుఁడనన్యచిత్తుఁడై యించుక భయమునఁ దన గృహంబునకుఁ బోయెను.

# ఇరువదిరెండవప్రకరణము

## ఉపనగరప్రాంతము

"........I am settled, and bend up
Each corporal agent to this terrible feat."

—*Macbeth.*

ఉత్ఫుల్లనీలోత్పల వేరేగదికిబోయి తలుపులు మూసికొని రెండుదినములవఱకును గదినుండి బయటికిరాలేదు. ఈ రెండు

దినములును తన కర్తవ్యాకర్తవ్యమును గూర్చి యాలోచించి స్థిరపఱచుకొనియెను.

స్థిరపఱచుకొని దృఢసంకల్పయుక్తురాలాయెను. సూర్యుఁడస్తమించెను. అప్పుడు ఉత్ఫుఉన్నీసా పేష్మన్ సహాయముతో వుడుపులు ధరించుచుండెను. ఆశ్చర్యమగువుడుపు. లంగా లేదు. ముసుకు లేదు. రవికె లేదు. స్త్రీలయుడుపులలక్షణమేమియు లేదు. వుడుపులుధరించి దర్పణమునుజూచుచు, పేష్మనితో "పేష్మన్! నన్ను గుర్తించుట కగునా?" అనెను.

పేష్మన్:—ఎవ్వరి తరము?

ఉత్ఫు:—అట్లైన పోయెద. నాతోఁగూడ దాసదాసీజనులెవ్వరును రానక్కఱలేదు.

పేష్మన్:—ఇంచుక సంకుచితనై నా యపరాధమును మన్నించునెడ నొకమాట యడిగెద.

ఉత్ఫు:—ఏమి చెప్పుము.

పేష్మన్:—నీయుద్దేశ్యమేమి?

ఉత్ఫు:—ఎట్లయినను కపాలకుండలకును దానిస్వామికిని చిరకాలవిచ్ఛేదము గలుగఁజేయవలయు ననునదే నాయుద్దేశ్యము. పిదప వాఁడు నావాఁడగును.

పేష్మన్:—బీబీ! చక్కఁగా వివేచనచేయవలయును. అది నిబిడమగు వనము; రాత్రికాలమున నొంటరిగా నెట్లు పోఁగలవు.

ఉత్ఫుఉన్నీసా దానికేమియు బదులు చెప్పక యిల్లు విడిచి కదలిపోయెను. సప్తగ్రామముయొక్క ఆ విజనమైన వనమయమైన ఉపనగరప్రాంతమున నవకుమారుని గృహముండెడు

దిశకు వెడలెను. అక్కడికి పోవునంతలో చీఁకటిపడెను. నవ కుమారునియింటికి సమీపముననే యొక వనమున్నది. అది పాతకమహాశయుల స్మరణమం దున్నదికదా. ఆవనము సమీపమునకుంబోయి యొక చెట్టుక్రిందఁ గూర్చుండెను. అచ్చట కూర్చుండి యేదుస్సాహసమును దలపోసియుండెనో దానిని నెఱవేర్పుటయం దించుక నాలోచింపసాగెను. ఘటనాక్రమంబున తానాలోచింపని యొక యనుకూలము దొరకెను.

ఉత్పఢఉన్నిసా కూర్చుండియుండిన తావున, ఉదాత్తానుదాత్త స్వరములేనిదియు, ఉచ్చానుచ్చ ధ్వనిలేనిదియు నగు మనుష్యకంఠమునుండి వెడలు నొక దండాకారశబ్దము సంతత ధారగా వినఁబడెను. విని లేచి నిలిచి నలుప్రక్కలందు జూడఁగా నావనమధ్యమున నొకవెలుతురు గానవచ్చెను. అది సాహసంబున నొకమనుష్యప్రమాణమునకన్న నెక్కువగా నుండుచుండిన యావెలుతురు గనంబడుచోటికిఁ బోయి, యచ్చటిసమాచారమును తెలిసికొనుటకై యొకచెట్టుమఱుఁగున నిలిచి చూచెను. చూడఁగా నది హోమముచేయు వెలుతురుగను, ఆ వినంబడిన శబ్దము మంత్రోచ్చారణముగను నుండెను. మంత్రోచ్చారణయందు మధ్యమధ్య నొక వ్యక్తి యొక్క నామముచ్చరింపఁబడుచుండెను. ఆనామమును విన్నంతనే యది యా హోమకారి సమీపమునకుఁబోయి కూర్చుండెను. అది యచ్చోటనే కూర్చుండియుండనిండు. పాతకమహాశయులకు చాలకాలముగా కపాలకుండల సమాచారము తెలియదుగాన నామె సమాచారమును తెలుపవలసినది యావశ్యకముగా నున్నది.

# ఇరువదిమూఁడవ ప్రకరణము

## శయ్యాగారము

"రాధాదుర్గవశం వదీకరణతా వాంఛా మమాస్త్యన్యథా"

—వ్రజాంగనాకావ్యము

ఉత్ఫఉన్నీసా ఆగ్రాచేరుటకును అచ్చటినుండి సప్తగ్రామంబునకు వచ్చుటకును సుమారొక సంవత్సరకాలము పట్టెను. కపాలకుండల ఒకసంవత్సరమునకంటె హెచ్చుకాలము నవకుమారుని గృహిణిగా నుండెను. ఏదినము ప్రదోష కాలంబున ఉత్ఫఉన్నీసా వనమునకు వచ్చియుండెనో, నాఁడు కపాలకుండల అన్యమనస్కయై శయ్యాగృహంబునం గూర్చుండి యుండెను. పాఠకమహాశయులు సముద్రతీరమందు గాలికి చెదరుచుండిన కుంతలములుగలదిగను, నిరాభరణ శరీరిగను నున్నపుడు గాంచియున్నారుకదా! ఇప్పు డాకపాలకుండల కాదు. శ్యామాసుందరియొక్క భవిష్యద్వాణి నిక్కమాయెను. స్పర్శమణిస్పర్శంబున యోగిని గృహిణి యయ్యెను. ఇపుడా యసంఖ్యకృష్ణోజ్జ్వల భుజంగవ్యూహ సదృశాగుల్ఫలంబిత మగు కేశరాశి వెనుకభాగమున స్థూలమగు వేణీబద్ధమై యున్నది. వేణీరచనయందును చాతుర్యవిశేషము గానంబడుచుండెను. కేశవిన్యాసమునం దనేకసూక్ష్మములైన కుట్టుపనులచే జడనల్లుటయందు శ్యామాసుందరికిఁగల కౌశలము విశదమగుచుండెను. కుసుమదామంబులను మఱచియుండ లేదు. నలుప్రక్కలను గిరీటమండల స్వరూపముగ జడచుట్టి యొత్తి

కట్టబడియుండెను. జడకు చేరని కురులు చెదరినట్లు కనఁబడ లేదు. అవి ఆకుంచన ప్రయుక్తములై చిన్నచిన్నవియగు కృష్ణ వర్ణముగల తరంగరేఖలవలె శోభిల్లుచుండెను. ఇప్పుడు ముఖ మండల మా కేశభారంబున సగము మూసికొనియుండలేదు. జ్యోతిర్మయముగా వెల్గుచుండినది. అచ్చటచ్చట జడనుండి జాఱిన కురులగుచ్ఛములు చెమటచే జడితమై యంటుకొని యుండెను. వర్ణము మొదటివలె పూర్ణశశికిరణము భాతి సౌంద ర్యముగానుండినది. ఇప్పుడు చెవులయందు తళతళమను రత్నాల కర్ణభూషణంబులు వ్రేలాడుచుండెను. గళంబున హిరణ్మయ మైన హారము నిగనిగ లాడుచుండెను. ఆవర్ణమున నవియన్ని యును మ్లానము కాలేదు. అర్ధచంద్ర కౌముదిని వసనముగా ధరించిన ధరణియొక్క తొడపై రాత్రియందు వికసించు కుసు మమువలెఁ బ్రకాశించుచుండెను. ఆమె కట్టియుండినది శుభ్రాం బరమైయుండెను. ఆ శుభ్రాంబర మర్ధచంద్రునిచే దీప్తమగు నాకాశమండలమునం దతి నిబిడముకాని తెల్లని మేఘమువలెఁ బ్రకాశించుచుండెను.

వర్ణమేమో అర్ధచంద్రకిరణమయ మైనదే. అయినను, ఇంచుక నల్పుగా నాకాశప్రాంతంబున నల్లని మేఘమువలెఁ గనఁబడుచుండెను. కపాలకుండల ఒక్కతెయే యుండలేదు. వదినెయగు శ్యామాసుందరియు సమీపమునఁ గూరుచుండి యుండెను. ఇరువురును పరస్పరము మాటలాడుచుండిరి. వారల సంభాషణలోని కొన్నియంశములను పాఠకమహాశయులు విన వలయును.

కపాలకుండల:—ఇంటియల్లుం డ్రింకెన్ని దినములుందురు ?

శ్యామ:—రేపటి సాయంకాలము వెడలిపోయెదరు. ఆహా! యీనాటి రాత్రి యౌషధమును సంపాదించి గ్రహించి కొనియుండినచో వారిని వశీకరణము చేసికొని మనుష్య జన్మమును సార్థకము చేసికొందును. నేడు పోవు టెట్లు?

కపాలకుండల:—పగలు తెచ్చిన ఫలింపదు. సగము రాత్రికి పోయి విప్పినతల విప్పినట్లే యుండఁగా మూలికను తీసి కొని రావలయును. ఒక్కరితోడను మాటలాడక తెచ్చి దేవునింటియం దుంచవలయును. అట్లు చేయవలయు నని యుంటిని. అది సాగకపోయినది.

కపాలకుండల:—నేను నేఁటియుదయమునం దా చెట్టును జూచి వచ్చియున్నాను. అది యుండువనమును దెలియుదును. నీవు రావలసినది లేదు. నే నొక్కతెయేపోయి యామూలికను తెచ్చెదను.

శ్యామ:—ఒకనాఁడు పోయివచ్చినందులకై పడినపాటు చాలును. రాత్రికాలమున నీవు బైట పోవద్దు.

కపాలకుండల:—దానికై నీ వేల చింతింపవలయును. రాత్రు లలో నరణ్యములయందు తిరుగుట నాకు చిన్ననాఁటి నుండియు నభ్యాస మనిచెప్పలేదా? అట్టి యభ్యాసము నాకు లేకుండినచో మిమ్ము నేను జూచుదానను కాను కదా.

శ్యామ:—నీకు భయమని చెప్పలేదు; అయినను ఒంటరిగా రాత్రికాలంబున నడవియందు తిరుగుట గృహస్థులయింటి కోడండ్రకుఁ దగునా? ఇద్దఱును జతగా పోయినందులకే తిట్లువచ్చెను. ఇంక నీవొక్కతెవు మాత్రము పోయినచో బ్రదుకు టెక్కడిది?

కపాలకుండల:—దానివలన నష్టమేమి? నేను రాత్రియం దొం టరిగాఁ బోయినమాత్రమున దుష్టచరిత్ర యగుదు నని యేమైనఁ జింతిల్లెదవా?

శ్యామ:—నే నేమియు నట్లు తలంపను. కుత్సితజనులు చెడ్డ మాట లాడికొందురు.

కపాలకుండల:— అనుకొన నిమ్ము. దానివలన నేను చెడ్డదాన నగుటలేదు.

శ్యామ:—అట్లు కాదు. నిన్నుఁగూర్చి యెవరైనను చెడ్డమా టన్నచో మాకు క్లేశము గలుగును.

కపాలకుండల అట్టి యకారణక్లేశమును మనస్సునం దుం చకుము.

శ్యామ:—నా కట్టిదేమియు లేదుగాని, అన్న కేల యసంతు ష్టిని గలుగఁజేయవలయును?

కపాలకుండల తన సహజమగు స్నిగ్ధోజ్జ్వలకటాక్షముచే శ్యామాసుందరిని జూచి, "ఇంతమాత్రమునకే వారు యసం తుష్టు లైనచో నే నేమి చేయుదును? స్త్రీలకు వివాహము స్వాతంత్ర్యమును దప్పించి దాసీత్వమును గలుగఁజేయు నని యెఱింగియుంటినేని నేను వివాహము చేసికొని యుండను" అనెను.

కపాలకుండల చెప్పినమాటలు శ్యామాసుందరికి అయి ష్టముగానున్నందున నేదో కార్యాంతరాసక్తయైనట్లు లేచి పోయెను.

కపాలకుండల సహిత మింటిపనులుచేయుటకై పోయెను. పనులన్నియుఁ దీర్చి, మాలికను వెదకుటకై వెడలెను. అప్పుడు

రాత్రి మొదటిజాము మీఱియుండెను. వెన్నెలకాలము. నవకుమారుఁడు బయటిగదియందు కూర్చుండియుండినవాఁడు. కపాలకుండల బైటపోయిన దానింగని, బయటికివచ్చి చేయి పట్టుకొనియె. కపాలకుండల, "ఎందులకు" అని యడిగెను.

నవకుమారుఁ డెచ్చటికి పోయెదవని యడిగెను. వాని మాటలయందు తిరస్కారసూచన లేవిసుము లేవు.

కపాలకుండల:—శ్యామాసుందరికి తనమగని వశపఱచుకొనుటకై మూలికను వెదకి తెచ్చుటకు పోవుచున్నాను.

నవకుమారుఁడు:—"నిన్నటిదినముపోయియుంటిరిగదా; మరల నేఁడేల పోవలయును?"

కపాలకుండల:—నిన్న వెదకితిమి. దొరకలేదు; నేఁడు పోయి వెదకవలయును.

నవకుమారుఁడు మృదుభాషణంబున, "మంచిది; పగలు వెదకగూడదా?" యనియె. వానిస్వరము స్నేహపరిపూర్ణత వహించి యుండెను.

కపాలకుండల:—మూలిక పగలు తెచ్చినచో ఫలింపదు.

నవకుమారుఁడు:—నీకు మూలికను వెదకుటే పనియా? ఆచెట్టుపేరు చెప్పుము. నే నా మూలికను దెచ్చియిచ్చెదను.

కపాలకుండల:—చెట్టునుజూచినఁ దెలియునుగాని, దానిపేరు నాకుఁ దెలియదు. అదియునుగాక మీరు తెచ్చినచో ఫలింపదు. స్త్రీలు విప్పినతల విప్పినట్లుండఁగా దానిని తేవలయును. మీరు పరోపకారంబున కేల విఘ్నము చేసెదరు?

ఈమాట నామె యప్రసన్నతతోఁ జెప్పెను. నవకుమారుఁడు, "పో, నేనును నీతోఁగూడ వచ్చెద" ననియెను.

కపాలకుండల దర్పముతో, "రండు; నేను అవిశ్వాసినో కాదో కనులారఁ జూడవచ్చు" ననియెను.

నవకుమారుఁడు మాటాడక యామె చెయ్యిని వదలి పెట్టి యింటిలోనికిఁబోయెను. కపాలకుండల యొంటరిగా వన మధ్యంబునఁ బ్రవేశించెను.

# ఇరువదినాలవ ప్రకరణము

కాననతలము

"........Tender is the night,
And happy the Queen moon is on her throne
Clustered around by all her starry rays;
But here there is no Light."

—*Keats.*

సప్తగ్రామమునందు నవకుమారు నివాసస్థలమునం దచ్చ టచ్చట వనమయమై యుండెనని పాఠకులకుఁ దెలియును గదా! గ్రామంబున కనతిదూరంబున నిబిడ మగువనములో కపాలకుండల యొంటరిగా కాలిబాటను మాలికను వెద కుచుంబోయెను. రాత్రి నిశ్శబ్దముగ నుండెను. నిశియం దాక సంబున స్నిగ్ధమయ మగు కిరణములు గల చంద్రుఁడు నిరా తంకముగ శుభ్రమేఘఖండంబులను దాఁటి పోవుచుండెను. భూమియందు వనవృక్షలతాదులు నిశ్శబ్దమగు శీతల చంద్ర కిరణంబునందు విశ్రాంతినిఁ బొందుచుండెను. నావృక్ష పత్త్రము లన్నియు నిశ్శబ్దముగ నా శశికిరణములను ప్రతిఘాత మొనరిం చుచుండెను. ఆలతాగుల్మంబుల మధ్యమున శ్వేతకుసుమం

ఋలు వికసించి యుండెను. పశుపక్ష్యులు నిద్రాసుఖము ననుభ వించుచుండెను. ఒకానొకప్పుడు విశ్రామభంగమైనపక్షి పక్షం బులను విదలించుశబ్దము వినవచ్చుచుండెను. అచ్చటచ్చట నొకటిరెండు ఎండిన యాకులు రాలెడిశబ్దము చెవింబడు చుండెను. ఒక్కొకచో నెండినయాకులనడుమ క్రిమికీటా దులు సంచరించుప్రాంత కర్ణతాడితమైయుండెను. ఒక్కొక ప్రక్క దూరముగా కుక్కలఅరచుశబ్దము వీనులసోకుచుండెను. మధుమాస స్నేహస్నిగ్ధకరమగు వాయువువలె గాలి మెల్లగా వీచుచుండెను. దానివలన కేవలము భూమికి తాకుచుండిన శ్యామలపర్ణములు మాత్రము కదలుచుండినవి నీలాంబర సంచారియగు తెల్లనగు మేఘము ఖండఖండమై మెల్లమెల్లగఁ బోవుచుండెను. వాయుసంసర్గమున పూర్వానుభవం బగు సుఖాస్పష్టమైనస్మృతి హృదయంబునందు గోచర మగు చుండెను.

కపాలకుండల కట్లె పూర్వస్మృతి గోచరమగుచుండెను. ఇసుకతిన్నెలపై కూర్చుండియుండఁగా తన లంబాయమానం బగు అలకమండలంబునసాగరవారిబిందువులు చల్లఁగా సోఁకు చుండినది జ్ఞాపకంబునకు వచ్చెను. అమలమై నీలమై యనం తమై వెలయు నాకాశంబును తలయెత్తిచూచెను. అప్పు డా యమలనీలానంతగగనరూపియగు సముద్రము జ్ఞప్తికివచ్చెను. కపాలకుండల తన పూర్వస్థితినిఁ గూర్చి వితర్కించుచు అన్య మనస్కయై పోవుచుండెను.

ఇట్లు పోవుచు నెచ్చటి కేపనికై పోవుచుండుట జ్ఞప్తి యందులేక పోవుచుండెను. దారి అగమ్యమాయెను. వనము

నిబిడమాయెను. చెట్లకొమ్మలు మిగుల దట్టముగ నున్నందుచే వెన్నెల మఱుఁగైనది. ముందుమార్గము కనఁబడలేదు. అందువలనఁ జింతామగ్నుడై యుండినది మేలుకాంచెను. అట్టిట్టు చూడఁగా నిబిడమగు వనమధ్యమున నొకవెలుతురు కానవచ్చెను. ఈవెల్తురునే ఉత్పడుస్నీసా చూచియుండెను. కపాలకుండల పూర్వాభ్యాసబలమున దానింగాంచి భయపడక కుతూహలాయత్తచిత్తయై వెలుతురు కానవచ్చిన దిక్కునకుఁ బోయెను. అచ్చట అగ్ని మండుచుండెను. ఎవ్వరు నచ్చట లేరు. అయినను, కొంచెముదూరమున చెట్లధికముగా నుండినందున స్పష్టముగా గోచరింపని యొక శిథిలమైన గృహముండెను అది ఇటికరాతితోఁ గట్టఁబడిన చిన్నగృహము. సామాన్యమైనది. అక్కడ అది యొక్కటేగృహము. ఆగృహము లోపలనుండి మనుష్యులు మాటలాడుశబ్దము వినంబడుచుండెను కపాలకుండల చప్పుడులేక యాగృహ సమీపంబునకుఁ బోయెను. లోపల ఎవరో యిద్దఱు సావధానముగ మాటలాడుచుండిరి. చెవియిచ్చి వినఁగా దిగువ నుదహరించిన మాటలు వినవచ్చెను.

ఒకఁడు:—నాయభీష్టము వధ చేయవలయుననుట. నీ విందులకు సమ్మతపడకున్నచో నేను నీకు సహాయము చేయను. నీవును నాకు సహాయము చేయవలదు.

మఱియొకవ్య—నేను మంగళంబును గోరుట లేదు. యావజ్జీవమును వెడలఁగొట్టుట నాయిష్టము. వధించుటకు నేను సమ్మతింపను.

ప్రథమాలాపకాః:—నీవు తెలియనిదానవు నీకు జ్ఞానమే లేన.

ట్లున్నది. నీకొక రహస్యవృత్తాంతమును జెప్పెద, నలు దిక్కులను జక్కఁగాఁ జూచికొమ్ము; ఎచ్చటనో మనుష్య శ్వాసశబ్దము వినఁబడుచున్నది, అనెను.

వాస్తవముగా కపాలకుండల లోపల జరుగుచుండిన సంభాషణమును చక్కఁగా వినుటకొఱకై యాయింటి గోడకు తల నానించి చెవియొగ్గి వినుచుండెను. వినవలసినను యాతురాతిశయంబునను భయంబునను నిట్టూర్పులు నిగుడించుచుండెను.

ఇంటిలోనుండిన యిరువురలో నొకవ్యక్తి చెప్పినమాట విని మఱియొకవ్యక్తి వెలుపలికివచ్చి చూడఁగా, కపాలకుండల కంటఁబడెను. కపాలకుండల, వెన్నెలవెలుఁగులో నాగంతుక పురుషుని యవయవంబులను స్పష్టముగాఁ జూచెను. చూచి ఆమె భయపడియెనో, లేక, ప్రఫుల్లయాయెనో, యేదియు దెలియదు. వచ్చినవాఁడు బ్రాహ్మణవేషముతో సామాన్యమగు దోవతిని గట్టియుండెను. వాఁడు భైరవాసమును కప్పుకొనియుండెను. వాఁడు కోమలవయస్కుఁడై యుండెను. ముఖమండలమున వయోచిహ్నము లేవియు గానఁబడలేదు. గాని, ఆముఖము సుందరీమణుల ముఖమువలె సుందరమైయుండెను. మఱియు వనితలవంటి దుర్లభగర్వ తేజఃపుంజ మగపడెను. వాని వెండ్రుకలు పురుషులవలె కురకర్మావశేషాత్మకమై యుండలేదు. స్త్రీల వెండ్రుకలవలె పుట్టువెండ్రుకలై యుత్తరీయముతో మఱుఁగుచేయఁబడి వీపునను బాహువులపైగను నొక్కొకతూరి వక్షఃస్థలముపైనను బడి వ్రేలాడుచుండెను. లలాటము విశాలమై యించుకస్ఫీతమై దాని మధ్యస్థల

మేకమాత్ర నాడీరేఖచే నమరి శోభిల్లుచుండెను. కన్నులు మెఱుమువంటి తేజంబుతోఁ బరిపూర్ణమై యుండినవి. చేతి యందు ఒరలేని ఖడ్గమొక్కటి యుండెను. ఆరూపరాశి మధ్యమున నొక భీషణంబగు మనోభావము వ్యక్తమగుచుండెను. హేమకాంతవర్ణంబునం దొక కరాళమగు మనోవాంఛయొక్క ఛాయ కన్పట్టుచుండెను. ఆపాదమస్తకపర్యంతమును భేదించి వెదకునట్టి యాకటాక్షమును గాంచి కపాలకుండలకు భయమయ్యెను.

ఇద్దఱును పరస్పరము చూచుచుండిరి. మొదట కపాలకుండల నిమీలితనేత్రయయ్యెను. ఉన్మీలితనేత్రయగునంతలో వచ్చినవాఁడు "నీవెవ్వర"ని యడిగెను.

ఒకసంవత్సరమునకు ముందా యిసుకదిబ్బల ఘోరకాననంబున కపాలకుండలను గూర్చి యీ ప్రశ్న నడిగియుండినచో నామె వెంటనే తగిన యుత్తరమునిచ్చుచుండెను. ఇప్పుడంచుక గృహస్థరమణీస్వభావాపన్నయైయున్నందున వెంటనే ప్రత్యుత్తర మియ్యలేకపోయెను. బ్రాహ్మణవేషధారి యామె నిరుత్తరయై నిలిచియుండుటం గాంచి, గంభీరభావముతో, "ఓకపాలకుండలా! నీ వీరాత్రిసమయంబున నీదట్టమగువనంబున కేలవచ్చితి" వని యడిగెను.

అజ్ఞాతుఁ డగు నిశాచరపురుషుని నోటనుండి తన పేరుచ్చరింపఁబడుటను విని కపాలకుండల వాడినమోముగలదై భయంబునఁ గుందెను. దానివలన నామెనోటనుండిమాటయే వెడలదయ్యెను.

బ్రాహ్మణవేషధారి:—"మేము మాటలాడుచుండుట వింటివా?" యనెను.

అప్పుడు కపాలకుండలకు వాక్శక్తి గలిగి యడిగిన ప్రశ్న కుత్తరమియ్యక యే, "నేను [illegible] [illegible] యడుగుచుంటివి; చెప్పు; మీ [illegible] [illegible] [illegible] చున్నారు?" అనెను.

బ్రాహ్మణవేషధారి [illegible] చింతానిమగ్నుడై నిరుత్తరుడై నిలిచెను. ఏదో యొక నూతనమగు నిశ్చితి యుపాయంబు దోచక యోచించువాని వలెనుండెను. తుదకతడు కపాలకుండలచేయిని బట్టుకొని కొంచెము దూరము పిలుచుకొని పోవ నారంభించెను. కపాలకుండల యతిక్రోధమున చేతిని విడిపించుకొనియె. బ్రాహ్మణవేషధారి మృదుస్వరమున కపాలకుండలచెవిలో, "చింతింపవలదు; నేను పురుషుడను గాను." అని చెప్పెను.

కపాలకుండల మఱింత విస్మితురాలై, యామాటను నమ్మియు నమ్మనిదానివలె నుండెను. అయినను, ఆ బ్రాహ్మణవేషధారివెన్నంటియా పడిపోయిన యింటినుండి చాలదూరము చనిన పిదప, బ్రాహ్మణవేషధారి, కపాలకుండలతో, "మేము చేయుచుండిన సంకల్పము దెల్పెద. ఆసంకల్పము నీవిషయమయ్యే చేయుచుండిన" దనియెను.

కపాలకుండల, భయమును ఆతురమును పొందై "విని యెద" ననియెను.

బ్రా. వేషధారి:—అట్లయినచో నేను పోయినవచ్చునట

కును నీవు ఇచ్చటనే వేచియుండు మనిచెప్పి యాంపాడింటివైపు పోయెను.

కపాలకుండల కొంచెముసేపు కూర్చుండి తానుకనివినిన దంతయుఁ దలఁచుకొని యుత్కటమైన భీతిం జెందెను. ఒంటరిగా అంధకారంబున వనమధ్యమునం దుండుటవలన భయము మెండయ్యెను. అదియునుగాక, ఆ ఛద్మవేషధారి యగు బ్రాహ్మణుఁ డేయుద్దేశ్యముతో నామె నచ్చటఁ గూర్చుండఁ బెట్టి పోయినాఁడో యదెవరికిఁ దెలియును? తలఁచుగాఁ దన దురుద్దేశ్యమును నెఱవేర్చుకొనుటకై కూర్చుండఁబెట్టిపోయి యుండవచ్చునని తలపోసి మఱింతభయవిహ్వలచిత్తయయ్యెను. బ్రాహ్మణవేషధారి చాలసేపుదాఁక రాలేదు. కపాలకుండల తత్తర మొంది లేచి త్వరత్వరగా నడచి యింటివైపుపోవు చుండెను.

అప్పు డాకాశమండలము గాఢాంధకారమై చీఁకటి గ్రమ్ముచువచ్చెను. అందువలన నామె శీఘ్రముగా నడుచుచు వనమును దాఁటి వచ్చెను. వచ్చునపుడు వెనుక నెవరో నడచి వచ్చెడు శబ్దము వినఁబడెను. వెనుక దిరిగి చూచెను. చీఁకటి గాన నెవ్వరును గనఁబడలేదు గాని, బ్రాహ్మణవేషధారిగా నుండునని యెంచికొనెను. వనమునుండి వెలికివచ్చి మొదట చెప్పిన కాలిబాటను జేరెను. అచ్చట అంత చీఁకటిగానుండ లేదు. కాఁబట్టి స్థూలపదార్థములన్నియుఁ గన్నులకుఁ గనఁ బడుచుండెను. అయినను జక్కఁగాఁ దెలియునంతటి వెల్తురు లేదు. దానివలన త్వరగా నడిచెను. మనుష్యుని కాలుచప్పుడు మఱింత స్పష్టముగా వినవచ్చెను. ఆకాశము నల్లని మేఘమా

లికచేనిండి భీషణతరంబగుచువచ్చెను. కపాలకుండల యింకను త్వరపడెను. గృహము సమీపమాయెను. గృహమును జేరు నంతలోఁ బ్రచండమగువర్షము గురియఁదొడంగెను. కపాలకుండల పరుగిడెను. వెనుకవచ్చుచుండిన వ్యక్తియును పరుగిడి వచ్చునట్లు వినఁబడియెను. ఇల్లు కంటికగపడునంతలో మహోత్తరమైన వర్షముగురిసి యామెను తడిముద్దగాఁజేసెను. వెంట్రుకలు తడిసి నీరుకార నారంభించెను. గంభీరమైన మేఘగర్జనముతో పిడుగులు పడు శబ్దమగుచుండెను. మఱిమఱి మెఱుపు మెఱయుచు ముసలధారగా వర్షము కురియుచుండెను. కపాలకుండల యెట్లో యొకవిధంబున నింటిచెంతకు వచ్చిచేరెను. అచటనుండి మెట్లెక్కుట కారంభించెను. ఆమెకొఱకై యింటి తలుపు తీసియుండెను. లోపలికిఁ బోయి తలుపువేసికొనుటకై వాకిలివైపు తిరిగిచూడఁగా, మహోన్నతాకారముగల పురుషుఁ డొక్కఁడు నిలిచియున్నట్లు కనఁబడియెను. ఆసమయమం దొకతూరి తళతళమని మెఱుపు మెఱిసెను. ఆ వెల్తురులో వానిని గుర్తించెను. వాఁడు సాగరతీరవాసియైన కాపాలికుఁడై యుండెను.

# ఇరువదిఐదవప్రకరణము

## స్వప్నము

"I had a dream, which was not all a dream.

-*Byron*.

కపాలకుండల మెల్లమెల్లగాఁదలుపుమూసికొని శయ్యాగారంబునకువచ్చి మెల్లనమంచముపైఁ బరుండెను. మనుష్యుని

హృదయ మనంతమైన సముద్రము. దానిపై ప్రచండ వాయువు వీవందొడంగునప్పుడా తరంగముల నెంచుట కెవరికి సాధ్యము? అట్లే కపాలకుండల హృదయసాగరంబునం బుట్టి మోదుచుండిన తరంగమాలికల నెవరు లెక్కపెట్టం గలరు?

ఆరాత్రి నవకుమారుఁడు హృదయవేదనచే నంతఃపురంబునకు రానందున శయనాగారంబున కపాలకుండల యొక్కతెయే పరుండెను. ఆమెకు నిద్దురపట్టలేదు. ప్రబలవాయువులచే తాడితంబై వారిధారచే తడిసిన జటాజూటమువలన నావరింపఁబడిన మాముఖమండలము చతుర్దిశలందును గనంబడుచుండెను. అది నలుదిక్కులు చూచుచుండెను. అప్పుడు పూర్వవృత్తాంతంబుల నన్నింటిని యాలోచింపసాగెను. కాపాలికుని విషయంబున నేవిధమైన యాచరణసలిపి తాను వెడలి వచ్చియుండెనో యది జ్ఞప్తికి వచ్చెను.

కాపాలికుఁడా నిబిడమగువనంబునందే పైశాచికకృత్యంబు లాచరించుచుండెనో, యవియన్నియు జ్ఞప్తికివచ్చెను. వాఁడాచరించుచుండిన భైరవిపూజయు, నవకుమారునిఁగట్టి యిసుకయందు దొర్లించియుండినదియు జ్ఞప్తికి వచ్చెను. ఆమె మేను వడంకెను. ఈ రాత్రి జరిగినదంతయు హృదయమధ్యమందు ఉదయమగుచువచ్చెను. శ్యామాసుందరికి మాలికయం దాసయును నవకుమారుని యాక్షేపణమును, దానికి తాఁజేసిన తిరస్కారమును, దానిపై అరణ్యముయొక్క జ్యోత్స్నామయంబగు శోభారాశియును, కాననతలమునందలి యంధకార

మును, అచ్చటఁ గన్పడిన యాసహచరునిభయంకరమగు కాంతిమయరూపమును, స్మృతికి వచ్చెను.

తూర్పుదిక్కునందు ఉషస్సుయొక్క మకుటజ్యోతి ప్రకటితమాయెను. అప్పుడు కపాలసుండల కించుక నిద్రపట్టెను. ఆ ప్రగాఢములేని నిద్రయం దొకస్వప్నము గాంచెను. ఆ స్వప్నమునందు, తాను మొదటఁజూచియుండిన సాగరహృదయంబున నావ నెక్కిపోవుచుండెను. నావ బహుళమణిమయమై యుండెను. దానికి రక్తవర్ణ పతాకము గట్టంబడియుండెను. నావికు లందఱును కంఠంబునఁ బుష్పమాలికలనుధరియించియుండిరి. రాధామాధవుని యనంత ప్రణయసంగీతము పాడుచుండిరి. పశ్చిమదిగ్భాగంబున సూర్యుఁడు సువర్ణధారల నాహ్వానము చేయుచుండెను. సముద్రము సువర్ణధారలతోఁ గూడి హాసమయిగా నవ్వుచుండెను. ఆకాశమండలంబున మేఘరాశి యాసువర్ణవృష్టిలో మునిఁగి తేలుచుండెను. ఆకస్మికముగా చీఁకటిక్రమ్మెను. సూర్యుఁ డగోచరుఁడాయెను. సువర్ణమయ మేఘంబులన్నియు నెచ్చటనో మాయమైపోయెను. నిబిడమైన నీలమేఘ మాకాశంబునం దంతయు వ్యాపించెను. సముద్రంబున దిక్కు తెలియుట యసాధ్యమయ్యెను. నావికులు పడవను ద్రిప్పిరి. ఏదిక్కునకు త్రిప్పవలయునో దానిని నిర్ణయింపరైరి. వారు పాడుచుండిన సంగీతమును నిల్పివేసిరి. కంఠములందు ధరించియుండిన పుష్పమాలికలను త్రెంచి పాఱవైచిరి. గాలిలేచెను. నారికేళవృక్షప్రమాణము అలలులేచెను. ఎఱ్ఱనిరంగుపతాకము జాఱుచువచ్చి నీటఁబడిపోయెను. తరంగమధ్యమునుండి బృహదాకారమైన దేహము

గల జటాజూటధారి యగు పురుషుఁడొక్కఁడువచ్చి యామె కూర్చుండియుండిన పడవనుఎడమచేతితోనెత్తి సముద్రమధ్యంబునఁ బాఱవైచుట కుద్యుక్తుఁడాయెను. ఆసమయంబునభీకర కాంతిమయరూపముగల బ్రాహ్మణవేషధారివచ్చి పడవను బట్టుకొనెను. పడవను బట్టుకొని నిన్ను ముంచివేయుదునా? బ్రతికింతునా? యని యడిగెను. దాని కామె "ముంచు" మని నోరు జాఱి ప్పెను. బ్రాహ్మణవేషధారి పడవను విడిచిపెట్టెను. అప్పుడు పడవ శబ్దమయమై మాటలాడుట కారంభించి, "నే నింక నీభారమును మోయఁజాలను; మునిఁగి పాతాళంబునకు పోయెద" నని చెప్పెను. ఇట్లని చెప్పి యామెను నీటముంచి పాతాళంబునకు వెడలిపోయెను. ఈవిధముగా స్వప్నమాయెను.

కపాలకుండల యీస్వప్నమును గాంచి మేనంతయుఁ జెమర్చుచుండ, మేల్కాంచిలేచి కనులుతెఱచి చూడఁగాఁ దెల్లవాఱియుండెను. కిటికి తలుపు తెఱచియుండెను. అందుండి వసంతకాలపు చల్లనిగాలి వీచుచుండెను. మందమారుతముచేఁ దూగాడుచెట్లకొమ్మలపైనుండి పక్షులు కలకలధ్వని చేయుచుండెను. ఆకిటికి పైభాగమున గొన్ని మనోహరము లగు వనలతలు ప్రసరించి సువాసిత మగు కుసుమంబులతో శోభిల్లుచు గాలికి అల్లాడుచుండెను. కపాలకుండల నారీస్వభావమున లతలను గుంపుగాఁ జేర్చిపట్టి లాగెను. దానియం దొక లతకుఁ గట్టఁబడి యుండిన కాగితము చేతికి జిక్కెను. కపాలకుండల, వనవిహారిణిగనుండినను దేవస్థానాధికారిణికి శిష్యురాలై యుండెను. గనుక నామెయొద్ద చదువుకొని యుండెను.

కాగితమును జదివెను. అందు, "నేఁడు సాయంకాల మైనపిదప నిన్నరాత్రి నిన్నుఁజూచిన బ్రాహ్మణవేషధారిని వచ్చి చూడ వలయును. నీవు నీసొంతవిషయమై వినఁగోరిన కొన్ని యత్యంతావశ్యకములైనమాటలను విందువు. అహం బ్రాహ్మణవేషధారి" అని యుండెను.

# ఇరువదియాఱవప్రకరణము

## సంకేతస్థానము

'.........I will have grounds
More relative than this."

*-Hamlet.*

కపాలకుండల యాదినమంతయు అనన్యచింతాన్వితయై బ్రాహ్మణవేషధారినిఁ జూచుట యుక్తమా? అయుక్తమా?" యని మనంబున వితర్కించుచుండెను. పతివ్రతయు నబలయు నైన తాను రాత్రిసమయంబున నిర్జనమగు నరణ్యంబున నపరిచితుఁ డగు పురుషునియొద్దకుఁ బోవుట సరికాదని యామె మనస్సునకు సంకోచము పుట్టలేదు. ఆమె తన మనస్సునందు, పరపురుషులనుచూచునట్టి యుద్దేశముదూష్యముకాదని తెలిసికొనియుండినది. మఱియు, పురుషులకుపురుషులను స్త్రీలకు స్త్రీలను జూచుటకు నేయధికారముగలదో, స్త్రీలుపురుషులను జూచుటకు నదేవిధమైన యధికారముండుటయే యుచితమని భావించికొనెను. ఇదియునుగాక బ్రాహ్మణవేషధారిస్త్రీయో పురుషుఁడో అనుమానము. కావున నా సంకోచ మనావశ్యకము

అయినను, పోయి చూచుటయందు మంగళకరమో అమంగళకరమో యది తెలియకున్నందున కపాలకుండల యింత దూర మాలోచించెను. ఇంతియగాక, మొదట బ్రాహ్మణవేషధారితో మాటలాడినదియు, ఆపిమ్మట కాపాలికుని జూచినదియు, దానిపై కలిగిన స్వప్నమును, కపాలకుండలకు హృదయంబునందు మహాభయము కలిగెను. తన కేదో శీఘ్రకాలముననే యమంగళము సంభవించెడు నని మనస్సున మిగుల కలత జనించెను. కాపాలికునింజూచి యుండెనుగాన నాయమంగళము వానిమూలముగానే సంభవించునని బోధమయ్యెను. బ్రాహ్మణవేషధారి కాపాలికుని సహచరుఁడై యుండు ననియును, వానిని పోయి చూచుటవలన భయవిషయీభూతమైన అమంగళమే కల్గుననియును, నావిషయమయ్యే మాట లాడుచుంటిమని చెప్పియుండుటచేతను వాఁడు నా అమంగళ నివారణార్థమై వచ్చి మాటలాడి పోవలయునని వ్రాసియుండు ననియును తలంచెను. ప్రకృతము కపాలకుండల డోలాయమానమానసయై యున్నందున మఱియు నిట్లాలోచించెను. బ్రాహ్మణకుమారుఁ డిం కొకమనుష్యునితో మాటలాడుచుండెను గదా; ఆమనుష్యుఁడే కాపాలికుఁడుఁగా నుండును. వారి మాటలవలన నొకరిని వధింపవలయు నని యాలోచించి నట్లు తోఁచుచున్నది. వధ చేయక, యావజ్జీవము వెడలఁగొట్టవలయునని మాటలాడిరి. ఇది ఎవరిని గూర్చిన ప్రస్తావనయై యుండును ? బ్రాహ్మణవేషధారి, నన్ను గుఱించియే యాసంకల్పము చేయుచుంటిమని చెప్పియుండెను. అట్లున్నచో నా మరణవిచారముననే, లేక నాచిరనిర్వా

సిత విచారమున నే, యాత్రాలోచనము జరిగియుండును. కావున బ్రాహ్మణవేష ధారిని రాత్రికాలమునందా దుర్గమకాననమునకు నొంటిగా చనుట కేవలము విపత్తునుకోరి పోయినట్లగును. అయినను నిన్న రాత్రి స్వప్నమును గాంచితిని. దాని యర్థమేమి? స్వప్నంబున బ్రాహ్మణవేషధారి విపత్కాలమునవచ్చి రక్షించెద నని చెప్పియుండెను. కార్యమును అటులే జరిగి యున్నది. బ్రాహ్మణవేషధారి యన్నిసంగతులను విశదముగాఁ జెప్పుట కిష్టముగలవాఁడై యున్నాఁడు. స్వప్నంబునందు నేను "ముంచుము" అని చెప్పితిని. కార్యమును అటులే జరగునేమో? అయినను బ్రాహ్మణవేషధారి సహాయము మొనరించుట మాని విపత్సాగరమునముంచునా? అట్లు జరగదు. భక్తవత్సలయైన భవాని నన్నుఁ గాపాడును. నాకు జాబువ్రాసిన బ్రాహ్మణవేషధారి, యున్నను సంరక్షింపవలయు ననెడి సంకల్పము కలవాఁడుగ నున్నాఁడు. వాఁడు చేయివిడిచినచో మునుఁగ వలయును. అని యాలోచించి యా బ్రాహ్మణవేషధారిని జూడవలయునని స్థిర పఱచుకొనియెను.

విజ్ఞులైనవారు కపాలకుండలవలె సిద్ధాంతము చేయుదురో లేదో సందేహముగా నున్నది. అయినను, విద్వాంసుల సిద్ధాంతముతో మన కేమియుఁ బ్రయోజనము లేదు. కపాలకుండల విజ్ఞురాలుకాదు. గాన, విజ్ఞులవలె సిద్ధాంతము చేయక, కౌతూహల పరవశయైన స్త్రీవలె సిద్ధాంతము చేసెను. భీకర కాంతిమయరూపరాశిని జూచుటకై ఆశాపరవశయైన యువతి వలె సిద్ధాంతము చేసెను. నిశియందు ప్రతివనమున విహరించు విలాసినియగు సన్న్యాసినిచేఁ బాలింపఁబడిన యువతివలె

సిద్ధాంతము చేసెను. భవానిపై నుంచియుండిన భక్తిభావము వలన విమోహిత యగు సబలవలె సిద్ధాంతము చేసెను. జ్వలితమగు వహ్నిశిఖయందు పడుటకై పోవునట్టు పతంగమువలె సిద్ధాంతమును చేసెను.

కపాలకుండల సాయంకాలమైన పిదప నింటిలోని పనిపాటులు నెఱవేర్చి, మొదటిదినమువలె వనాభిముఖయై వెడలెను. ఆమె వెడలునప్పుడు శయ్యాగారముననుండిన దీపమును జక్కఁగాఁ బ్రజ్వరిల్లునట్లుచేసి చనెను. ఆమె గదినుండి వెలికి వచ్చిన వెంటనే దీప మాఱిపోయెను.

ఇంటనుండి వెడలినప్పుడు కపాలకుండల యొకసంగతిని మఱచి పోయెను. బ్రాహ్మణవేషధారి యెచ్చోటికివచ్చి తన్ను చూడవలయు నని వ్రాసియుండెనో దానిని తెలిసికొనుటకై మరలఁ యింటికిఁ బోయెను. పోయిచూడఁగా తానుంచినచోట లేకపోయెను. తలదువ్వుకొను సమయమున చీటిని మఱెక్కడనైన నుంచినచో మఱచిపోవుదునేమో యని తన కొంగునందే గట్టి యుంచికొన్నట్లు జ్ఞప్తికివచ్చెను. కొంగును చూచుకొనెను; అందులేదు. ఇంటిలో నచ్చటచ్చట వెదకెను. దొరక లేదు. కావున, మొదటిదినము చూచినస్థలమున కేపోయి బ్రాహ్మణ కుమారునిఁ జూడవలయునని స్థిరపఱచుకొని వెడలెను. పోవునట్టి వేగంబున వీడినకేశరాశిని ముడివేసి కొనునంతటి యవకాశము లేదయ్యెను. అందువలన, నీదినము వివాహము కాక మునుపుండినట్లు కేశమండలమధ్యవర్తినియై వెడలిపోయెను.

# ఇరువదియేడవ ప్రకరణము

## గృహద్వారము

"Stand you awhile apart
Confine yourself but in a patient list"

*-Othello.*

సంధ్యాకాలంబునకుఁ బూర్వము కపాలకుండల యింటి పనులు చేయుచుండునప్పుడు కొంగున గట్టియుండిన చీటి పడి పోయెను. అది యామె కెఱుక లేదు. నవకుమారుఁడు దానిం గని; యిదే మాశ్చర్య మని తీసి యుంచుకొనెను. కపాలకుండల కార్యాంతరాసక్తయై యుండెను. నవకుమారుఁ డాచీటిని జదివెను. ఆచీటినిఁ జదువఁగా నొకే సిద్ధాంతము కలుగుట సంభవమే గాని వేఱేసిద్ధాంతమునకుఁ గారణము లేదు. "నేఁడు సాయంకాలమైన పిదప నిన్నరాత్రి నిన్నుఁ జూచిన బ్రాహ్మణవేషధారిని వచ్చి చూడవలయును. నీవు నీసొంతవిషయమై వినఁ గోరిన కొన్ని యత్యంతావశ్యకములైన మాటలను విందువు అహం బ్రాహ్మణవేషధారి." ఇట్లనఁగా నేమి? ప్రణయవాక్యమే కదా? బ్రాహ్మణవేషధారి మృణ్మయికి ఉపపతిగా నుండును. అని తలంచెను. పాఠకులారా! కడచిన రాత్రి జరిగినవృత్తాంతము నెఱుఁగని వాని కిదితప్ప వేఱేసిద్ధాంతము జనించునా?

పతివ్రత తన పతితో సహగమనము చేయునప్పుడు, లేక యితర కారణములచే సజీవియై యుండువ్యక్తి తానై చితా రోహణము చేసినచో, చితి కగ్నిని ఉంతురు. అప్పుడు ప్రథమంబున ధూమరాశి లేచి నలుదిక్కుల నావరించుచున్నది. దానివలన దృష్టి లోపమై పోవును. చీఁకటి క్రమ్మును, పిదపఁ

గట్టెలరాశి మండ నారంభింపఁగానే మొదట క్రిందనుండి సర్పముయొక్క నాలుకవలె యొకటి రెం డగ్నిశిఖలు శరీర మును అచ్చటచ్చటఁ దాకి కలుచును. అనంతరము శబ్దసమే తమై యగ్నిజ్వాల నలుదిక్కులును లేచి యావరించుకొని యంగప్రత్యంగమును వ్యాపించి కాల్చును. తుదను ప్రచండ శబ్దముతో నగ్నిరాశి గగనమండలమును జ్వాలామయంబుగఁ జేసి శిరస్సును బగులఁజేసి అంగప్రత్యంగముల నంతయు భస్మరాశిగాఁ జేయును.

నవకుమారునకు చీటిని జదివినపు డీరీతి యాయెను. మొదట నేమియు స్థిరపఱచజాలఁడయ్యెను. అనంతరము సంశ యము; పిదప నిశ్చయము. తుదను జ్వాల. శోకాధిక్యమును గాని సుఖాధిక్యమునుగాని మనుష్యుని హృదయమునందొక్క మాఱుగా గ్రహింపఁజాలదు. క్రమక్రమముగా గ్రహణము చేయును. నవకుమారునకు మొదట ధూమరాశి యావరించు కొనియెను; పిదప నగ్నిశిఖ దేహమును దహించునట్లు చేయ నారంభించెను. తుదను వహ్నిరాశి హృదయమును భస్మీభూ తముగాఁ జేయ నారంభించెను. ఇంతకు మునుపే కపాలకుం డల అప్పుడప్పుడు తన మాటను వినుటలేదని తెలిసికొని యుండినాఁడు. ఇదియునుగాక, వాఁడు వలదని వారించినను వినక యిష్టమయిన చోటికిఁ బోవుచుండెను. ఎవరిని లక్ష్యము చేయుటలేదు. వానిమాటను తృణీకరించి యర్ధరాత్రి సమ యంబున నొంటరిగా నడవికిం జని సంచరించుచుండెను. ఇట్టి నడతవలన నెవరికైనను సంశయము గలుగును; అయినను నవకుమారుఁడు హృదయంబున నామె విషయమున సంశ

యము నుంచికొన్నచో నెన్ని దినములకును నివారణగాని తేలు కాటువలె నగునని తలంచి యొక్కనాఁడైనను సంశయమున కవకాశమీయలేదు. నేఁడును సంశయమున కవకాశ మియ్యఁ దగిన వాఁడు కాఁడు. అయినను, నేఁడు లేఖవలన ప్రత్యక్ష మయ్యెను.

దుఃఖవేదనయొక్క ప్రథమవేగము తగ్గిపోయినపిదప నవకుమారుఁడు విషణ్ణుఁడై కూర్చుండి పెద్దప్రొద్దు కన్నీరు కార్చెను. పిదప స్థిరపఱుచుకొని చేయవలసిన దేమని నిర్ణయించుటకు దృఢప్రతిజ్ఞుఁ డాయెను. నేఁడు కపాలకుండలను నేమియు ననలేదు. కపాలకుండల సంధ్యాకాలంబున వనాభిముఖయై చనినప్పు డాయమవెంట గోప్యముగాఁ బోవలయు ననియును, కపాలకుండల యొనర్చు మహాపాతకమును గన్నులారఁజూచి త్యజింపవలయుననియును, ఆమీఁద తనప్రాణమును త్యజింపవలయుననియును, దృఢప్రతిజ్ఞ కలవాఁ డాయెను. ఇట్లు చేయక మఱేమి చేయఁగలఁడు? ఇఁక భరింపఁగూడని భారమును మోసికొని జీవించియుండుటకు వాని కావంతయైనను సమ్మతముండునా?

ఇట్లు మనస్సున స్థిరపఱుచుకొని కపాలకుండల వనంబునకుం బోవుసమయంబును నిరీక్షించికొని యుండెను. ఆమె యిలువెడలి యించుకదూర మరుగఁగానే నవకుమారుఁడును బయలుదేఱెను. అప్పుడు కపాలకుండల చీటికై వెనుకకుం దిరిగి యింటకి వచ్చెను. దానింగాంచి వాఁడు మఱుఁగున నిలిచెను. ఆమె మరల బయటికివచ్చి కొంతదూర మరిగినపిదప నవకుమారుఁడును ఆమె మార్గము ననుసరించుచుండెను.

కొంచెము దూరము పోఁగా దేహమును గప్పుకొని యొక దీర్ఘాకారపురుషుఁడు నిలిచియుండెను.

వాఁ డెవఁడు? ఎందులకు నిలిచియున్నాఁడు? వాని సమాచారమును దెలిసికొనుటకు నవకుమారున కించుకయైన నిష్టము లేదు. వానివైపుకూడ చూడలేదు. కపాలకుండలను కంటికి మఱుఁగు కాకుండునట్లు చూచుకొని పోవుటయందు బద్ధానురాగుఁడై యుండెను. కనుక దారిని బట్టిపోవుటకై యెదుట నిలిచియుండిన పురుషుని ఓత్తుకట్టి త్రోసెను. అయి నను, వానిం గదలింపలేక పోయినాఁడు.

నవకుమారుఁడు:—ఎవరు నీవు? దూరముగా పో, నాకు దారి విడువుము.

ఆగంతుఁడు:—నే నెవఁడని నీకు దెలియదా?

ఈశబ్దము సముద్రనాదమువలె చెవిం బడెను. నవకుమారుఁడు దృష్టించి చూచెను. చూడఁగా వాఁడు పూర్వపరిచితుఁడగు జటాజూటధారి యైన కాపాలికుఁడై యుండెను.

నవకుమారుఁ డాశ్చర్యమును జెందెను. కాని, భయపడలేదు. నవకుమారుని ముఖము ప్రఫుల్లమై, "కపాలకుండల, నిన్నుఁ జూచుటకై పోవుచున్నదా?" యని యడిగెను.

కాపాలికుఁడు, "లేద"నియెను.

దీనిని విని జ్వలించుటకై లేచెడు మంటవలె; అప్పుడే ప్రకాశించునట్టి వాని యాశాప్రదీప మారిపోయి, మరల వాని మోమున మొదటివలె మేఘమయమై అంధకారము క్రమ్ముకొనియె.

నవకుమారుఁడు, "అట్లులైన మార్గమును విడువుము" అనెను.

కాపాలికుఁడు, మార్గమును విడుతునుగాని నీతోఁ గొన్ని మాటలాడవలసి యున్నది. మొదట దానిని వినుము.

నవకుమారుఁడు:— 'నీతో మాటలేమి? నీవు మరల నాప్రాణనాశనము చేయవచ్చితివి! వలసినచో నాప్రాణమును గొనుము. నేను నిన్ను ఆక్షేపింపను. నీవించుక వేచియుండుము. నేను మరలివచ్చెద, నేను మొదటనే దేవియొక్క సంతోషంబునకై యీశరీరము నియ్యక పోయినందులకై యిప్పుడు దానికిఁ దగిన ఫల మనుభవించుచున్నాను. ఎవ్వతె నన్ను రక్షించెనో, యదియే నన్ను ధ్వంసము చేసెను. ఓ కాపాలికుఁడా! నీవిపుడు నన్ను నమ్ముము. నేను ఇప్పుడే మరలి వచ్చి నీకాత్మసమర్పణము చేసెదను" అనియె.

కాపాలికుఁడు:—"నేనిప్పుడు నీవధార్థమై వచ్చిన వాఁడను కాను. భవానికట్టి యిష్టము లేదు. నేనేమి చెప్పుటకై వచ్చియున్నాఁడనో దానిని నీవు ఆమోదించవలయును. ఇంటికిఁ బొమ్ము, నేను చెప్పునది వినుము."

నవకుమారుఁడు:—ఇప్పుడు వలదు. వేఱొకసమయంబున వినియెదను. ఇపు డించుక తాళుము. నా కవసరమైనపని కలదు. ఆపనిని దీర్చికొని వచ్చెదను.

కాపాలికుఁడు:—(నవ్వి) నాకన్నియును దెలియును. నీ వా పాపినిఁ జూచుటకై దానివెంటఁ జనియెదవు. అది పోయెడు చోటు నాకుం దెలియును. నిన్నా చోటికి నే పిలిచికొనిపో

రొదను. ఏమి చూడవలయునని యున్నావో దానిం
జూతువు. ఇప్పుడు నామాటనువినుము. భయమొందకుము.

నవకుమారుఁడు:—ఇప్పుడు నీయొద్ద నాకేమియు భయము
లేదు. రమ్ము.

ఇట్లని చెప్పి నవకుమారుఁడు కాపాలికుని ఇంటికిం బిలిచు
కొనిపోయి కూర్చుండఁబెట్టి తానును గూర్చుండి; "యేమి
చెప్పవలయునో చెప్పు" మనియెను.

# ఇరువదెనిమిదవ ప్రకరణము

పు న రా లా ప ము

"తద్గచ్ఛ సిద్ధ్యై కురు దేవకార్యమ్."

—కుమారసంభవము.

కాపాలికుఁడాసనమును గ్రహించి రెండు చేతులను
జాచి నవకుమారునకు జూపెను. నవకుమారుఁడు చూడఁగా
రెండుచేతులును విరిగిపోయి యుండెను.

ఏరాత్రి కపాలకుండలతో నవకుమారుఁడు సముద్రతీ
రమునుండి పరుగిడివచ్చెనో, యారాత్రి కాపాలికుఁడు వారిని
వెదకుచు బోవునపుడు వాఁడు ఇసుకగుట్టపైనుండి పడెననుట
నది పాఠకమహాశయుల స్మరణమందుండవచ్చును. వాఁడుపడి
నప్పుడు భూమిపై రెండుచేతులతో వానిశరీరమును సంర
క్షించికొనుటకై ప్రయత్నించెను. దానివలన శరీరమేమో
దక్కెను. గాని, రెండుచేతులును విరిగిపోయెను.

కాపాలికుఁడు స్వవృత్తాంతము నంతయు నవకుమారునకుం దెల్పి బాహువులచే సర్వక్రియాదులను జరుపుటకు విఘ్న మేమియు లేదు. గాని, వానియం దింతకుముందున్న బలము లేదు. సమిధలనుగూడ తెచ్చుకొనుటకు సామర్థ్యము లేదు. అని పల్కి మరలఁ జెప్పనారంభించెను.

"పైనుండి పడిన దెబ్బకు ఎముకలు విరిగినదే గాక వెంటనే మూర్ఛితుఁడనైతిని. అట్టి యజ్ఞానావస్థయందును గొంచెము సేపు తెలిసియు గొంచెము సేపు తెలివిలేకయు నుండెను. ఎన్నాళ్లిట్లుంటినో తెలియదు. సుమారు రెండు రాత్రులు నొక పగలు ఇట్లుంటి నని తోఁచుచున్నది. తెల్లవారికి చక్కఁగాఁ దెలివి వచ్చెను. తెలివి కల్గుటకు కొంచెము సేపునకు ముందొక కలఁగాంచితిని. కలలో సాక్షాత్ భవానియే వచ్చి (ఇట్లు చెప్పు చుండఁగా కాపాలికుని శరీరము రోమాంచితమాయెను.) బొమలు ముడివెట్టుకొని నన్నుఁ గొట్టి "ఓరి దురాచారుఁడా! నీవు మలిన చిత్తములతో చేయుచుండిన పూజకు విఘ్నము గలుగఁ జేసితిని; నీవు ఇంద్రియ లాలసుఁడవై యిదివఱకును కుమారిక రక్తముచే నాపూజ జరుపలేదు. గాన, నీవిదివఱకును జేసిన పూజ విఫలమాయెను; ఇఁకముందు నీపూజను గ్రహించుటలే"దనెను. నేను దానికి దుఃఖించి భవాని చరణంబులపైఁ బడితిని. అపు డాదేవి ప్రసన్నయై యిందులకుఁ బ్రాయశ్చిత్త మొక్కటే కలదు. అదేమన, కపాలకుండలను దెచ్చి నాకు బలి యియ్యవలయును. ఆబలి నిచ్చువఱకును నీవు నాపూజ చేయవలదు. అనెను. ఇట్లు కలగంటిని."

"అనంతరము నే నెన్నిదినంబుల కెట్లు స్వస్థతనుబొందితినో దానిం జెప్పి ప్రయోజనము లేదు. క్రమముగా ఆరోగ్యమును బొంది యాభవానీ దేవి యనుజ్ఞను నెఱవేర్ప నారంభించితిని. అయినను, నా బాహువులయందు చిన్నబిడ్డల బాహువులలోని బలమంతకూడ లేదు. బాహుబలము లేనందున నాయత్నము సఫలము కాదు. అందువలన, దీనికొక సహచారి యావశ్యకము. అయిన నిప్పుడు మనుష్యులందఱును ధర్మంబునం దల్పమతులై యున్నారు విశేషకలిప్రాబల్యముచే యవనులు రాజులైరి. పాపాత్మకమగు రాజశాసనంబున నిట్టి కార్యంబున కెవరును సహచరులు కారు. చాలదినములు వెదకి యాపాపిష్ఠురా లుండుచోటును గనిపెట్టితిని. అయినను, బాహుబలాభావమున భవాని యనుజ్ఞ నెఱవేర్పలేకున్నాను. కేవలము మనస్సిద్ధికై తాంత్రికవిధానుసారముగ క్రియాకలాపంబుల నాచరించుచున్నాఁడను. నిన్నరాత్రి యిచటి సమీపమునందలి వనమున హోమము చేయుచుంటిని. అప్పుడు కపాలకుండలతో నొక బ్రాహ్మణకుమారుఁడు చేరియుండుటను నాకన్నులార జూచితిని. నేఁడు వానిని జూడఁబోవుచున్నది. చూడవలయు నని కోర్కి యున్నచో నాతోడ రమ్ము; చూపెదను"

"వత్సా! కపాలకుండల వధకు యోగ్యురాలు. నేను భవాని యనుజ్ఞ మేరకు దానినివధింతును. అదియునుగాక, నీయందు విశ్వాసఘాతుకరాలై యున్నది. నీకును అది వధకు యోగ్యురాలు. కావున, నీవు నాకు సహాయము చేయుము. ఈ విశ్వాసఘాతుకను బట్టుకొని యజ్ఞవాటికకు నిలిచికొనిపొమ్ము,

అప్పుట దానిని నీస్వహస్తమున వధచేయుము. దీనివలన నీవా సాహౌద్భవానియందు చేసిన యపరాధము పరిహార మగును. పవిత్రకార్యమునుచేసినచో నక్షయ పుణ్యప్రాప్తికల్గును. విశ్వాసఘాతుకను దండించినట్లగును. బదులుకుబదులు తీర్చుకొన్నట్లయ్యెడిని ”

అనిచెప్పి కాపాలికుఁడు మాటలను చాలించెను. నవకుమారుఁ డేమియు నుత్తర మీయలేదు. కాపాలికుఁడు వాని మౌనమును గాంచి, “వత్సా! నేఁజూపెదనని చెప్పితినికదా; వచ్చి చూడు” మనియెను.

నవకుమారుఁడు మేనంతయుఁ జెమర్చినవాఁడై కాపాలికుని వెంటఁ జనెను.

## ఏడవ ప్రకరణము

### సపత్నీ సంభాషణము

"Be at peace; it is your sister that
Addresses you—Requite Lucretia's love ",

-- *Lucretia.*

కపాలకుండల యిల్లువిడిచి బయలుదేరి కాననంబును బ్రవేశించెను. మొదట నా పాడింటి సమీపమునకుఁ బోయెను. అచ్చట బ్రాహ్మణునిం జూచెను. పగలుగానుండినచో దాని ముఖకాంతి మిగుల మలినమై యుండునని తోఁచెను.

బ్రాహ్మణుఁడు: కాపాలికుఁడు వచ్చునేమో; ఇచ్చట నేమాటయు నాడఁగూడదు. వేఱెచ్చటికైనఁ బోవుదము.

అని చెప్పి, బ్రాహ్మణుఁడు వేఱొకచోటికిం బిలిచికొని పోయెను. ఎచ్చటికి ? ఆవనమధ్యంబున నొక యిఱుకైన బయలు; దానిచుట్టును చెట్లు, మధ్య నేమియును లేదు; అచ్చోటికింబోయి యిద్దఱును గూర్చుండిరి.

బ్రాహ్మణుఁడు:- మొదట నా సొంతపరిచయమును దెలిపెదను. నామాటల నెంతదూరము నమ్మవచ్చునో దానిని నీవే యాలోచింపుము. నీనాథునితో సముద్రతీరమునుండి నీవు వచ్చునప్పుడు మార్గమునందు రాత్రివేళ నొక యవనస్త్రీని జూచినజ్ఞాపక మున్నదా ?

కపాలకుండల:- నా కాభరణంబుల నొసంగిన యదియా ?

బ్రాహ్మణుఁడు:—నేనే అది.

కపాలకుండల అత్యంతాశ్చర్యపరవశ యాయెను.

ఉత్ఫఉన్నీసా, యామె యాశ్చర్యపడుటనుగాంచి, యింకను మిగుల నాశ్చర్యకరమైనది యున్నది; నేను నీకు సవతి కావలయునని చెప్పెను.

కపాలకుండల చమత్కృతురాలై, అదెట్లని యడిగెను.

ఉత్ఫఉన్నీసా, ఆనుపూర్వికముగా తన పరిచయమును దెల్పుచు వచ్చెను. వివాహమైనదియు, జాతిభ్రష్టురాలైనదియు, పతివలనఁ దర్జింపఁబడినదియు, డక్కా, ఆగ్రా, జహాంగీరు, మెహరఉన్నీసా, ఆగ్రావిడిచినదియు, సప్తగ్రామనివాసంబును, నవకుమారునిఁ జూచినదియు, వానినడతయు, నిన్నటిదినము ప్రదోషకాలంబున కపటవేషంబుతో కాననంబునకు వచ్చుటయు, హోమము చేయుచుండినవానిం గాంచుటయు, మొదలైన సంగతులన్నియుం జెప్పెను.

అప్పుడు కపాలకుండల "నీవు కపటవేషంబున మా యింటికేయభిప్రాయముతో వచ్చితివి?" యని యడిగెను.

ఉత్పలఉన్నీసా:—నీకును నీస్వామికిని వియోగము గలుగఁజేయ వలయు ననెడి యభిప్రాయముతో వచ్చితిని.

కపాలకుండల:—కొంచె మాలోచించి, "ఎట్లు కలుగఁజేయ నెంచితివి?" అనెను.

ఉత్పలఉన్నీసా:—వెలికిఁ జూచుటకు నీపాతివ్రత్యంబున నీస్వామికి సంశయమును గలుగఁజేయనెంచితిని. అయినను, ఇప్పుడామాటతోఁ బ్రయోజనము లేదు. ఆమార్గమును మాని వేసితిని. ఇప్పుడు నీవు నే చెప్పినట్లు చేసినచో నాయిష్టసిద్ధి యగును. నీకును మంగళము గలుగును.

కపాలకుండల:—హోమము చేయుచుండినవాఁ డెవరి పేరు నుచ్చరించుచుండెను?

ఉత్పలఉన్నీసా:—నీపేరునే యుచ్చరించుచుండెను. వాఁడు నీమంచికో, లేక, చెడ్డకో దేనికై హోమము జేయుచున్నాఁడో దాని నెఱుంగవలయు నని పోయి నమస్కరించి వాని హోమకర్మము ముగియువఱకుఁ గూర్చుంటిని. హోమంబున హోమమంత్రములతో నీపేరును జేర్చుటకుఁ గారణ మేమని యడిగితిని. వానితోఁ గొంతవఱకు మాటలాడుటయందు నీ యమంగళమునకే హోమము చేయుచుండినాఁడని తెలియవచ్చెను. నాకును అదియే కావలసి యుండెను. దానిని గూడ వానికిఁ దెలిపితిని. తత్క్షణమే పరస్పరము సహాయము చేయవలయు నని యనుకొంటిమి. ఇంకను హెచ్చుసలహా లిచ్చుటకు వాఁడు నన్ను అభగ్నా

లయంబునకుఁ బిలిచికొనిపోయి యచ్చట తన మనోగత మును జెప్పెను. నీకు మరణావస్థ కలిగించుటయే వాని మత ముగా నుండెను. నేను దానికి సమ్మతింపలేదు. నే నీజన్మం బునఁ గేవలము పాపంబులనే యాచరించినదానను. అయి నను, నిరపరాధి యగు స్త్రీని వధించునంతటి మహాపాతకం బును చేయుదాననుగాను. ఆసమయంబున, నీవు నచ్చట నుంటివిగాన నామాటలను నీవును వినియుండవచ్చు నని తోఁచుచున్నది.

కపాలకుండల:—మీర లట్లువాదించుచుండిన దానిని నేనును వింటిని.

ఉత్ఫుఉన్నీసా:—నేను నిన్నెఱుఁగనిదాన ననుకొని, వాఁడు నా కేమో చెప్పవలయునని యుండెను. తుద కెవరో నిలిచి యున్నారని తెలిసి, నేను బయటికివచ్చి నిన్ను మఱుఁగునకుఁ బిలిచికొని పోతిని.

కపాలకుండల: నీవు మరల రావైతివేల ?

ఉత్ఫుఉన్నీసా: .వాఁడు అనేకవృత్తాంతములను దెలిపెను. ఆమాటలను వినుచుంటిని. ప్రొద్దు పోయెను. నీవు వాని నెఱుంగుదువా ?

కపాలకుండల:—వాఁడు నాపూర్వపాలకుం డగు కాపాలి కుఁడు.

ఉత్ఫుఉన్నీసా:—నిజమే. మొదట నీవు వానికి సముద్రతీరం బునఁ జిక్కినదియు, అచ్చట నిన్ను పాలించినదియు, నవ కుమారుని యాగమనము, వానితో నీపలాయనము, ఇవి

యన్నియును వాఁడే చెప్పెను. నీవు వెడలివచ్చినపిదప జరిగిన వృత్తాంతమును నీకుఁ దెలియదు; దానిని చెప్పెదను.

ఇట్లని ఉత్ఫఉన్నీసా, కాపాలికుఁడు శిఖరమునుండి క్రింద పడినదియు; వానిచేతులు విరిగినదియు; వాని స్వప్నము మొదలైనవియు నన్నియుఁ జెప్పెను. స్వప్నవిచారమునువిని కపాలకుండల భయముచే వడవడవడఁకెను. మనస్సునందు విద్యుచ్చంచలయాయెను.

ఉత్ఫఉన్నీసా:—కాపాలికునకు భవానియాజ్ఞను నెఱవేర్ప వలయు నను దృఢప్రతిజ్ఞ కలిగియున్నది. బాహుబలములేమి యన్యుల సహాయాపేక్ష కలవాఁడై యీవృత్తాంతముల నన్నిఁటిని జెప్పెను. నే నీదుష్కృత్యమున కియ్యకొనలేదు. ఈదుర్వృత్తినిగురించిన మాటను జెప్పుటయు అసహ్యముగా నున్నది. ఎప్పటికిని నేనిట్టిదుష్కృత్యంబునకు సమ్మతింపను. ఆ యభిప్రాయముచేతనే నిన్ను రఁగోరితిని. అయినను, ఆకార్యమునందు స్వార్థపరురాలై యుండుదును. కాని, నీప్రాణమును రక్షింతును. నీవు నాకొఱ కొకపని చేయవలయును.

కపాలకుండల:—ఏమి చేయవలయును ?

ఉత్ఫఉన్నీసా:—నీవు నాకుఁ బ్రాణదాన మొసరింప వలయును. నీస్వామిని నీవు త్యజింపవలయును. నేనిప్పుడుపతిగత ప్రాణనై యున్నదానను, అతనిని విడిచియుండలేను. నేను పాపిష్ఠురాలై యున్నను అనుభవమున స్త్రీలకు పతియే పరమగతియని తెలిసికొంటిని. వాఁడే యీప్రపంచమున సర్వస్వమై యున్నాఁడు. సకలసంపదలు, సుఖభోగములన్నియు వానిని సంబంధించియే యున్నవి. వాఁడు లేకుండినచో

నాఁడుది చచ్చినదానితోఁ దుల్యము. నేను దీనిని శాస్త్రము లందు చదివియుంటిని. ఇప్పు డది నాయనుభవంబున తెలిసి కొంటిని. ఈపాపిష్ఠి నైన నాచరిత్రమును మనసుంచి చది వినచోఁ జక్కఁగాఁ దెలియవచ్చును. మనోవాక్కాయ కర్మంబులందును పతివ్రతగా నుండునదే లక్ష్మీదేవి యవతా రము. కనుకనే సీతా, సత్యభామ, సావిత్రి, మొదలగు వారిని జనులు మహాలక్ష్మియొక్క యవతార మని చెప్పుచు న్నారు. నే నెంతో సుఖదాయక మనెడి మహదైశ్వర్య సంపదలయం దుంటిని. ఒక్కనాఁడైన సుఖపడలేదు. దారి యందు నీకు నేను ఆభరణంబుల నిచ్చినరాత్రి నాస్వా మినిఁ జూచినమాత్రమునఁ గలిగిన సుఖ మిం కెట్టితపస్సు చేసినను నాకుఁ గలుగనేరదు. పతియే నాకుఁ బ్రాణస్వరూ పమై యున్నాఁడు. ఆపతితోఁ గూడియుండుటకై నీవు నా కుపకృతి యొనర్చినచో నాకుఁ బ్రాణదాన మిచ్చిన ట్లగుచున్నది. నీ వుండువఱకును వాఁడు నావాఁడు కాఁడు. వాఁడు మహానిష్ఠుఁడు. ఈనాదుర్వృత్తి యెంతదూరము ఫలించునో చెప్పలేను. నీవు లేకున్నయెడల తుద కతని యింటివాకిటియందు వసించుచు ప్రతినిత్యము నాతని సంద ర్శనము చేసికొనుచు జన్మసార్థకమును చేసికొనవలయు నని యున్నదానను. మీ మీదాంపత్య సంబంధవిచ్ఛేద మొన రించుట మహాపాతక మనియును తెలియును. అయినను, ఒకదినముగాని ఒకముహూర్తముగాని పతి నాపైఁ బ్రస న్నుఁడైనచో నామహాపాతకంబు లన్నియు ధ్వంసములగు నని నిశ్చయించికొని యున్నాఁను. కావున, నీవు నీస్వామినిఁ

ద్యజించి నాకుఁ బ్రాణదాన మొసంగవలయును.

కపాలకుండల:—(పెద్ద ప్రొద్దుచింతించి) స్వామినివిడిచి యెక్కడికిఁ బోదును ? నాకును అతఁడే కదా గతి ?

ఉత్ఫఉన్నీసా:—విదేశంబునకుఁ బొమ్ము. చాలదూరముపొమ్ము. నీకు మేడయిల్లు నిచ్చెదను. రాజ్ఞివలె నుందువు.

పరదుఃఖంబునకుఁ బొల్పదు స్వభావముగల ముగ్ధయగు కపాలకుండల యట్లే చింతామగ్నురాలై యుండి నలుప్రక్కలం జూచి యేమియుఁదోఁచక, ఉత్ఫఉన్నీసా యొక్క సుఖ సాధన మార్గంబునకు నేనేల ప్రతిబంధకముగా నుండవలయునని యనుకొని, దానింగాంచి "నీవు నా కుపకారము నొనరించి యున్నదానవో కావో నే నెఱుంగను. మిద్దెటిండ్లు, ధనము, ఐశ్వర్యము, దాసదాసీజనంబులు నాకక్కఱ లేదు. నీసుఖంబునకు నేనేల యడ్డపడవలయును? నీయిష్టము చొప్పునఁ గానిమ్ము. నేను వనచారినై యుంటిని. మరల వనచారి నయ్యెద" ననియెను.

ఉత్ఫఉన్నీసా ఆశ్చర్యపరవశరాలై యింత శీఘ్రమున నామె సమ్మతించు నని యెంచలేదు. అది ఆశ్చర్యపరవశరాలై "భగినీ! నీవు చిరాయుష్మతివిగా నుండుము. నాకుఁ బ్రాణదాన మొసంగితివి. అయినను, నిన్ను అనాథగా బంపుట కిష్టముగలదానను గాను. రేపు తెల్లవారెనా విశ్వాసయోగ్యురాలగు దాసినొక దానిని నీచెంతకుఁ బంపెదను. దానితోఁ గూడ పొమ్ము. వర్ధమాన నగరంబున మిగుల గొప్పవంశపు వనిత యొక్కతె నాకు ముఖ్యస్నేహితురాలున్నది. ఆమె నీకుఁ గావలసినదాని నంతయు సమకూర్చి యిచ్చు"నని చెప్పెను.

ఇట్లు వారిరువురును సంభాషించుచు ముందు రాఁగల విఘ్నమున కెదురు చూడలేదు. వారు కూర్చుండియుండిన స్థలమునుండి పోవుచుండిన కాలుదారియం దించుక దూరము నందే కాపాలికుఁడును నవకుమారుఁడును క్రూరదృష్టితో కపాలకుండలను, బ్రాహ్మణవేషధారిని చూచుచుండిరి గాని, వీరు వారినిఁ జూడలేదు. మఱియు, వీరు పరస్పరము మాట లాడుటను వినునంతటి సమీపమున నిలిచియుండలేదు. మను ష్యుని కన్నులును చెవులునుకూడ సమానమగు దూరగాములై యుండినచో మనుష్యుని దుఃఖప్రవాహము హెచ్చుచుండునో తగ్గుచుండునో యెవరు చెప్పఁగలరు? లోకులీసంసారరచనమును అపూర్వకౌశలమయ మైనదని చెప్పెదరు.

నవకుమారుఁడు, కపాలకుండల చెదరిన కుంతలములు గలదై యుండినదానిం జూచెను. ఆమె యెప్పుడు వానిభార్య కాలేదో యప్పుడే దానికొప్పు వీడిపోయెను. చూచుచుండఁ గానే యాకుంతలరాశి యాబ్రాహ్మణుని వీపుపైఁబడి వాని భుజముపై నెగసి వానికేశదామంబునఁ జేరుచుండెను. వారిరు వురు నేకాంతముగా మాటలాడుచు కేవలము సమీప సమీప మున గూర్చుండినందున కపాలకుండలయొక్క అతిశయకేశరాశి ఉత్ఫుల్లస్నిగ్ధమై ప్రసరించి దాని శరీరార్ధమును దాఁచివేసెను. ఆకేశభార మడ్డమై వారిరువురును తమ్ముఁజూచుచుండిన వారిని జూడరైరి. వారినిం గాంచి నవకుమారుఁడు నిలువనోపక మెల్ల మెల్లఁగ భూతలమునం గూలెను.

కాపాలికుఁడు నవకుమారుని యవస్థనుగాంచి, తన నడు మునఁ గట్టికొనియుండిన సారకాయుబుడ్డిను చేతనంది, "వత్సా!

వారినింగని నీమనస్సుచెడి బడలి బలము తగ్గిపోయిన ట్లున్నది. ఈమహౌషధమును పానముచేయుము. ఇయ్యది భవాని ప్రసాదము. దీనిని త్రాగినచో బలముగలుగు ననిచెప్పి యాబుడ్డిను నవకుమారుని నోటియొద్దకుఁ బట్టెను. వాఁ డన్యమనస్కుఁడై యాబుడ్డిలోనున్న దానిని పానముచేసి, దారుణంబగు దప్పిని బాపికొనియెను. అది కాపాలికుని స్వహస్తముతోఁ జేసిన మహామాదకమైన మద్య మని నవకుమారుఁ డెఱుంగఁడు. పానముచేయఁగానే బలముగలవాఁడై మతి విభ్రమము గలుగ నారంభించెను.

ఇచట ఉత్ఫఉన్నీసా మొదటివలె మృదుస్వరమున కపాలకుండలనుగూర్చి, "భగినీ! నీ యుపకారమునకు సరియగు ప్రత్యుపకారమును నేనుచేయలేను. నీవు నన్ను బహుకాలము నీజ్ఞాపకమునం దుంచికొనియుండినచో దానివలననే నేను సుఖనొందును. నేను నీకొసఁగిన యాభరణంబుల నన్నిటిని యొక దరిద్రున కిచ్చివేసితివని వింటిని. ఇప్పుడు నాచెంత నేమియు లేదు. నిన్నటిదినము అన్యోద్దేశ్యంబున తలవెండ్రుకలయందొకయుంగరమును దాఁచికొని తెచ్చియుంటిని. జగదీశ్వరుని కృపవలన నే దలఁచియుండిన పాపకృత్యము సిద్ధింపలేదు. ఈ యుంగరమును నీయొద్ద నుంచికొనియుండుము. దానిం జూచి నప్పుడెల్ల నీసవతి యగు యవనమానినిని జ్ఞాపకమునకుఁ దెచ్చికొనుము. నేఁడు నీస్వామి యడిగినచో ఉత్ఫఉన్నీసాయొసఁగెనని చెప్పుము" అని ఉత్ఫఉన్నీసా అమూల్యమగు తనయుంగరమును దీసి యామెచేతి కిచ్చెను. నవకుమారుఁడు దానిని సహితము జూచెను. కాపాలికుఁడు వానినిఁ బట్టుకొని యుండెను.

వాఁడు వణఁకుట కారంభించుటం గాంచి మరల వానికి సురను త్రాగించెను. మద్యము నవకుమారుని తలకెక్కి వాని ప్రకృతి నంతయుఁ బాడుచేసి ప్రణయాంకురమును సహితము హృదయాలవాలమునుండి పెకలించివేసెను.

పిమ్మట కపాలకుండల ఉత్ఫఉన్నీసాయొద్ద సెలవుపుచ్చుకొని తన యింటివైపువెడలెను. కాపాలికుఁడు నవకుమారునిఁ దీసికొని ఉత్ఫఉన్నీసాకుఁ గానరాకుండ వేఱుమార్గముగా కపాలకుండల ననుసరించి పోయెను.

# ముప్పదవ ప్రకరణము

—గృ హా భి ము ఖ ము—

"No Spectre greets me - no vain shadow this."

—*Wordsworth.*

కపాలకుండల మెల్లమెల్లఁగా గృహాభిముఖియై పోవుచుండెను. చాల తిన్నగా మృదుచరణములిడుచుఁ బోవుచుండెను. ఏలనఁగా, ఆమె యతిగాఢమగు చింతయందు మగ్నయై యుండెను. ఉత్ఫఉన్నీసా చెప్పిన సమాచారమువలన నామె చిత్తభావ మొకేతూరి వికలమై పోయెను. ఆమె దేహావిసర్జనము చేయుటకు సిద్ధపడియెను. దేహావిసర్జన మెందుకొఱకు? ఉత్ఫఉన్నీసా కొఱకా? దానికి కాదు.

అంతఃకరణ సంబంధమునం దామె తాంత్రికునిచేఁ బరిపాలితయై వానివలన బోధింపఁబడినదై యుండెను. తాంత్రికుఁడు కాళికానుగ్రహాపేక్షితుఁడై యితరులప్రాణసంహారమం

దెట్లు సంకోచశూన్యురాలై యుండెనో, యామెయునట్టియాశ
గలదై స్వప్రాణమును విసర్జనచేయుటయం దట్టి సంకోచ
శూన్యురాలై యుండెను. కాపాలికునివలెనే అనన్యచిత్తమై
శక్తియొక్క ప్రసాదప్రార్థినిగా నుండకపోయినను రేయింబవళ్లు
శక్తియొక్క భక్తి శ్రవణ దర్శన సాధనంబులయం దామె
మనస్సు కాళికానురాగముచే వ్యాప్తమై యుండెను. కాళిక
సృష్టిశాసన కర్త్రియనియు, ముక్తిదాయకి యనియు నామెకు
నమ్మకముండెను. కాళి పూజాస్థానము నరమాంసరక్తముచే
ప్లావితమగునను దానిని, పరదుఃఖమునందు దుఃఖితయగు నామె
హృదయము సహింప లేకుండెను. అయినను, భక్తిప్రదర్శన
మైన కార్యంబునం గొంత చేయుచుండలేదు. ఇప్పు డాజగ
చ్ఛాసన కర్త్రియును, సుఖదుఃఖవిధాయినియును, కైవల్య
దాయినియు నగుభైరవి, బ్రాహ్మణవేషధారిగా ప్రాణసంపత్క
కార్థినియై స్వప్నంబున ప్రత్యక్షమై, "ముంచివేయుదునా? బ్రతి
కింతునా?" యనఁగా కపాలకుండల "ముంచుము" అనెను.
కావున, ఆయనుజ్ఞ మేరకే యేల నడువకుండ వలయును.

మనము ప్రాణత్యాగము చేయుట కిష్టము గలవారము
గాము. మనమందఱమును రాగాదులచే బద్ధులమై యిహసం
సారము సుఖమయమైనదని చెప్పెదము. సుఖప్రత్యాశవలననే
చక్రాకారమగు సంసారమునందు పరిభ్రమించెదము. దుఃఖ
ప్రత్యాశవలన కాదు? ఎప్పుడైనను మనయొక్క స్వయంకృత
దోషముచే నాసుఖము ప్రత్యాశ విఫలీకృతమైనచో నప్పుడుమా
త్రముదుఃఖముగలిగెననిగట్టిగా నొఱపెట్టుచు నేడ్చుచుందుము
పిమ్మటఆదుఃఖము సంసారనియమముగాదనియును అది సంసార

నియమంబునకు వ్యతిక్రమమనియును సిద్ధాంతము చేసికొందుము. మనకందఱకును సుఖమేగాని దుఃఖములేదు. ఆసుఖమునందు మనమందఱమును ఇహసంసారమున బద్ధులమై, అనఁగా, మిగులబలకరమగు వేరునాటుకొనినవారమైయున్నారము. ఇహసంసారమును విడుచుట మనకిష్టము లేదు. ఏలన, ఇహసంసారబంధనంబునకుఁ బ్రణయము ప్రధానమగు రజ్జువుగా నున్నది. కపాలకుండల కాబంధనము లేదు. అట్లున్నప్పుడెవ్వ రామెను నిలుపఁగలరు?

దేనికి బంధనములేదో అది యప్రతిహతంబగు వేగము గలదగుచున్నది. గిరిశిఖరమునుండి ప్రవాహవేగముగావచ్చునపుడు దాని నెవ్వ రడ్డగింపనేర్తురు? అది యొకప్పుడు వాయుతాడితమైనచో దానివలనం గలుగు ఉల్లోలకల్లోలము నెవరు నిరోధింపఁగలరు? కపాలకుండల చిత్తమావిధముగ ఉల్లోలకల్లోలమైయుండఁగా దాని స్థితిస్థాపన మెవరుచేయఁగలరు ? ప్రాయము గల కరికుంభస్థలమునకు మద మెక్కినచో దానింబట్టి యెవరు నిలుపఁగలరు ?

కపాలకుండల తనలోదాను, "ఈశరీరమును జగదీశ్వరియగు భవానిచరణంబులయం దేందుకర్పింపఁగూడదు ?" అని ప్రశ్నచేసికొనియెను. ఈపంచభూతములవలనఁ గాఁగల దేమున్నది ? అని యిట్లు ప్రశ్నచేసికొనుచుండెను. గాని, దానికి సరియైన యుత్తరము తోఁచకుండెను. ఇహసంసారంబునకు లోఁబడవలసిన యితరసంబంధము లెవ్వియు లేకున్నను భూతబంధనము మాత్రము స్వతస్సిద్ధముగా నున్నది.

కపాలకుండల తలవంచుకొనిపోవుచుండెను. మనుజుని హృదయ మేదైన నొక ప్రబలమగు చింతావ్యాప్తమైయున్న చో బాహ్యప్రపంచమునందు వానిదృష్టి ప్రసరింపకుండుటయే గాక, అనైసర్గికమగు (Unnatural) పదార్థములు కంటికి గోచరించునట్లు మనస్సునకుఁ దోఁచును. కపాలకుండల యాయవస్థయం దుండెను. ఆమె తలపైనుండి "తల్లీ! నేదారిజూపెద" అను నొక యాకాశవాణి చెవినింబడెను. ఆమె యాశ్చర్యపరవశయై ఆకాశమును చూచెను. చూడఁగా ఆకాశమండలమున నవీనోదకపూరిత మేఘమును దిరస్కరించు నొకమూర్తి! దాని కంఠంబున నుండిన నరకపాలమాలికనుండి రక్తము ప్రవహించుచున్నటులుండెను; నడుమునందు మనుష్యబాహువుల పరిధానము కన్పట్టుచుండెను; ఎడమచేతియందు నరకపాలము; మేనంతయురక్తధార; అత్యంతజ్వాలచేఁ బ్రకాశించు లోచనప్రాంతమున నుపరిభాగమున లలాటమునందు బాలచంద్రుఁడు మెఱయుచుండెను; భైరవియే కుడిచేయి నెత్తి కపాలకుండలను బిలుచుచున్నట్లుండెను.

కపాలకుండల యూర్ధ్వదృష్టితో ముందునడచుచుండెను. ఆనవీన కాదంబినీ కాంతిగలరూపము నామెకు ముందు పోవుచుండెను. పోవునపు డొక్కొకసారి యాకపాలమాలికాధారిణి యవయవములు మేఘమున మఱుగైనట్లును; ఒక్కొక మాఱు కంటికిఁ జక్కఁగానగపడినట్లును దోఁచుచుండెను. నవకుమారుఁడుగాని కాపాలికుఁడుగాని వీని నేమియుఁజూడ లేదు; నవకుమారుఁడాతీక్ష్ణమగుసురాగరళముచేఁ బ్రజ్వలితహృదయుఁడై

కపాలకుండల తిన్నగాఁబోవుచుండుటనుగాంచి తనతోడవచ్చు చున్నవానింగూర్చి, "కాపాలికా!" యని యఱచెను.

కాపాలికుఁడు:—ఏమి ?

నవకుమారుఁడు:—పానీయం దేహి మే (నాకుఁద్రాగుట కిమ్ము.)

కాపాలికుఁడు, మరల వానికి సురను ద్రాగించెను.

నవకుమారుఁడు:—ఇంక సావకాశ మేల ?

కాపాలికుఁ "డింకసావకాశములేదు," అనెను. నవకుమారుఁడు భీషణధ్వనిచే, "కపాలకుండలా!" యని యఱచెను.

కపాలకుండల విస్మయమందెను. ఇదివఱకు నామెను "కపాలకుండల" అని యెవరును పిలిచినదిలేదు. అంత వెనుక దిరిగిచూచెను. ఇంతలో నవకుమారుఁడును కాపాలికుఁడును యామె యెదుటవచ్చినిలిచిరి. మొదట వారెవరైనది గుర్తింపఁజాలక, "మీరెవరు? యమదూతలా?" యనియెను.

వెంటనే వారిని గుర్తించి, కాపాలికునిఁజూచి, "తండ్రీ నన్ను బలిగానిచ్చుటకై వచ్చితివా?" యనియెను.

నవకుమారుఁడు, గట్టిగా నామెచేతిని బట్టుకొనియెను. కాపాలికుఁడు కరుణార్ద్రమగు మధురస్వరమున, "నావెంట రమ్ము" అని చెప్పి వాఁడు శ్మశానంబునకు దారి జూపుచు ముందుగా నడచెను.

కపాలకుండల యాకాశమందు భయంకరరూపిణి యగు శాంకరిని దృష్టించిచూచెను. చూడఁగా నా రణరంగిణియగు భైరవి కలకలనగుచు చేతియందు త్రిశూలమును

ధరించి కాపాలికుఁడు పోవుచుండిన దారిని జూపుచు పోయెను. నవకుమారుఁడు కపాలకుండల చేతిని గట్టిగాఁబట్టుకొని కాపాలికునివెన్నంటి పోవుచుండెను. అది అదృష్టపూర్వవలె మాటలాడక యుండెను.

# ముప్పదొకటవ ప్రకరణము

## ప్రేత భూమి

"వపుషాకరణోజ్ఝితేనసా నిపతంతీ పతి మప్యపాతయత్
నను తైలనిషేక బిందునా సహదీప్తార్చిరుపైతి మేదినీమ్"
—రఘువంశము.

చంద్రుఁ డస్తమితుఁడాయెను. విశ్వమండల మంధకార బంధురం బాయెను. కాపాలికుఁ డెచ్చట తనస్థానము నేర్పఱచుకొనియుండెనో యచ్చటికి వారలను బిలుచుకొనిపోయెను. ఆస్థలము గంగాతీరమం దొకవిశాలమగు నిసుకనేలగా నుండెను. దానికి ముందుప్రక్క మఱియొక యిసుకనేలయుండెను. అది శ్మశానము. రెండుస్థలములమధ్య వరద (Tide) వచ్చినప్పుడుమాత్రము కొంచెము నీరెక్కుచుండెను. ఇతరకాలములందు నీరుండదు. ఇప్పుడు నీరులేదు. శ్మశానభూమికి సమీపమున గంగప్రవహించుచోట ఉన్నతమైన యిసుకదిబ్బ; అచ్చట దిగినచో పైనుండి అగాధమగు నీటిలోఁబడిపోవుటయే సంభవము. ఆప్రక్క గాలి మెండై యలలుకొట్టుటచేతఁ గట్టు తెగిపోయి యుండెను. అప్పుడప్పుడు గట్టుయొక్క

మన్ను జాఱి లోఁతునీఁటిలోఁ బడిపోవుచుండెను. పూజసేయు స్థలమున దీపము లేదు. కట్టెలు మండుచుండెను. దానియస్పష్ట మగు వెల్తురువలన శ్మసానభూమి మఱింత భయంకరముగాఁ గానఁబడుచుండెను. సమీపమున పూజ హోమము బలి మొదలగువానికిఁ గావలసిన సామగ్రులు సిద్ధపఱిచియుంచఁబడి యుండెను. విశాలనదీహృదయంబున నంధకారము గ్రమ్ము కొనియుండెను. చైత్రమాసపుగాలి యప్రతిహతవేగంబుతో నీటిపై వీచుచుండెను. అందువలన తరంగాభిఘాతముచే నుద్భ వించిన ఘోరమనుశబ్దము గగనమంతయు వ్యాపించికొని యుండెను. శ్మశానభూమియందప్పుడప్పుడు శవములను భక్షిం చుమృగములు కర్కశధ్వని చేయుచుండెను.

కపాలికుఁడు కపాలకుండలను, నవకుమారుని, దర్భా సనముపైఁ గూర్చుండఁబెట్టి, తాంత్రిక సంబంధమైన పూజ నారంభించెను. అది జరుగుచుండఁగానే, వాఁడు నవకుమారు నితో, కపాలకుండలకు స్నానముచేయించి తోడ్కొనిరమ్మనెను. నవకుమారుఁ డామె చేతినిబట్టుకొని స్నానముచేయించుటకై పిలుచుకొని పోయెను. దారియందు వారికాళ్లకు యెముక తునుకలు గ్రుచ్చుకొని గాయములయ్యెను. నవకుమారుని కాలికి అచ్చోట నీరు నింపియుంచియుండిన కుండ తగిలి పగిలి యా నీటిచేఁ గాళ్లు తడిసెను. దానిసమీపముననే యొక శవము పడియుండినది. ఆ నిర్భాగ్యశవమున కెవరును సంస్కారము చేయలేదు. వారిరువురి కాళ్లును దానికిఁ దగిలెను. కపాలకుం డల దానిని చుట్టుకొనిపోయెను. నవకుమారుఁడు దానినిఁ ద్రొక్కుచు పోయెను. నాల్గుదిక్కులయందును కుక్కలు

నక్కలుతిరుగుచుండెను. అవి వీరినిం గాంచెను. కొన్ని మీఁదఁ బడెను, కొన్ని పాఱిపోయెను. కపాలకుండలను బట్టుకొనియున్న నవకుమారుని హస్తము వణఁకినట్లు కపాలకుండలకు తెలియ వచ్చెను. ఆమె నిర్భయమును, నిష్కంపితయునై "స్వామీ! భయపడుచున్నారా?" యని యడిగెను.

నవకుమారునకు మద్యముయొక్క మోహనశక్తి తగ్గు చుండెను. వాఁడతిగంభీరస్వరముతో "భయమా; మృణ్మయి! కాదు." అనెను.

కపాలకుండల:—కాకున్నచో వణఁకు టేల?

ఆమె యీప్రశ్నము నేస్వరమున నడిగెనో, యది కేవలము వనితాకంఠమునుండి ... వెడలవలసినస్వరముగా నుండెను. ఎప్పుడు వనిత పరదుఃఖమున కోర్వఁజాలకయుండునో యప్పుడే దాని కంఠమునుండి యట్టిస్వరము బుట్టును. ప్రాణము పోవునట్టి ఆసన్నకాలమునందు శ్మశానమునకు వచ్చియున్న పుడు కపాలకుండల కంఠమునందుండి యిట్టిస్వరము పుట్టునని యెవ్వరెఱుంగుదురు?

నవకుమార:—భయము కాదు, ఏడువ లేకున్నాననెడి కోపము చేత వణఁకుచున్నాను.

కపాలకుండల:—ఏడువవలసిన దేల?

ఇదియు వనితా కంఠస్వరమునుండి వెలువడిన స్వరమే.

నవకుమార:—ఏడువవలసిన దేలాకో దాని నీవెఱుంగు దువు! మృణ్మయి! నీవెప్పుడును రూపమునుజూచి ఉన్మత్తు రాలవై నది లేదు. (ఇట్లుచెప్పుచు చెప్పుచు నవకుమారుని కంఠము యాతనివలన రుద్ధమగుచుండెను.)

నీ వెప్పుడును నీహృత్పిండమును నీవే హృదయమునుండి ఛేదించి శ్మశానమునందు వేయుటకు వచ్చినదానవు కావు.

ఇట్లుచెప్పి నవకుమారుఁడు హాయని యేడ్చుచు కపాల కుండల పాదములపైఁ బడెను.

పాదములపైఁబడి యేడ్చుచు "మృణ్మయి! కపాల కుండల! నన్ను రక్షింపుము. ఇపుడు నీపాదములపై వ్రాలి యున్నాఁడను. నీవు అవిశ్వాసినివి కావని నీ నోటితోఁజెప్పుము. ఒక్కమాఱు చెప్పుము. నిన్ను నాతలపైనుంచికొని యింటికిఁ గొనిపోయెద" అని చెప్పెను.

కపాలకుండల నవకుమారుని గ్రుచ్చియెత్తి మృదుస్వర ముతో, "నీవు విచారముచేసి తెలిసికొనక పోతివి, నేనేమిఁ చేయుదును?" అనెను.

ఈమాట ముగించునంతలో ఇరువురును నదీతీరమును జేరిరి. కపాలకుండల ఇసుకదిబ్బపై నిలిచెను. ఆమెవీపు నది వైపుననుండెను. జాఱినచో నీటఁబడవలసినదే. ఆమె నవ కుమారుని ముందుగానుండెను. అప్పుడే జలోచ్ఛ్వాసమునకు ప్రారంభమైనది. కపాలకుండల, "నీవేమో విచారించలేదు కదా?" అని మరల యడిగెను.

నవకుమారుఁడు సాగరమగ్నునివలె చైతన్యములేని వాఁడై, "దేనిని విచారముచేయుదును? చెప్పుము, మృణ్మయి! ఒకతూరి చెప్పుము; చెప్పి నన్ను బ్రదికింపుము, ఇంటికి పోదము రమ్ము" అనెను.

కపాలకుండల:—నీవు అడిగినందువలనఁ జెప్పెద వినుము; నీవు ఈ దినము ఎవరిని జూచితివో అది పద్మావతి. నేను

అవిశ్వాసిని కాను. నిజస్థితిని జెప్పితిని; అయినను, నేను మరల ఇంటికిఁబోవుట లేదు. భవాని చరణములందు దేహమును విసర్జించుటకు వచ్చియున్నాను; స్వామీ! నీవు ఇంటికిపో, నేను చచ్చెదను, నాకొఱకు నీవు ఏడువ వలదు.

వద్దు, మృణ్మయి! వద్దు, అని గట్టిగాఁ జెప్పుచు దానిఁ కౌఁగిలించి పట్టుకొనవలయు నని నవకుమారుఁడు రెండుచేతులను చాచెను. అది చేతికిఁ జిక్కలేదు. చైత్రమాసపు ప్రచండ వాయువు వీఁచుచుండినందున పెద్దఅలయొకటి లేచి యా గట్టును మోదెను. ఆ తరంగతాడనమువలన ఆదిబ్బ జరిగి కపాలకుండలతోఁ గూడ ఘోరమైన ఘోషము చేయుచు నదీ ప్రవాహమునందు పడిపోయెను.

గట్టు జరిగిపడిన శబ్దమును నవకుమారుఁడు వినెను. కపాలకుండల అంతర్హితురాలైన దానిని జూచెను. వెంటనే యెగిరి నీటిలో దుమికెను. వాఁడు ఈదుటయందు మహా సమర్థుఁడుగ నుండెను. కొంచెముసేపు ఈఁది కపాలకుండలను వెదకెను. దొరకలేదు. వాఁడును లేవలేదు.

అనంతమైన గంగాప్రవాహ మధ్యమునందు వసంత వాయువుచే విక్షిప్తమైన తరంగమాలికలయందు కపాలకుండలయు నవకుమారుఁడును తేలుచు తేలుచు ఎచ్చటికేఁగిరి?

కపాలకుండల

సంపూర్ణము

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1954.

# వచనగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము | | | |
| " ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము వేంకటరంగశాస్త్రికృతము, ఒకటే సంపుటము | | 9 | 0 |
| " మూడుసంపుటములు | ... | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము | | | |
| " ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| " ఆరణ్యపర్వము | ... | 5 | 0 |
| " విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| " భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| " కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 5 | 8 |
| " శాంతిపర్వము | ... | 7 | 8 |
| " ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువరకు | | 7 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము | | | |
| బాలకాండము | ... | 2 | 8 |
| అయోధ్యాకాండము | ... | 5 | 8 |
| ఆరణ్యకాండము | ... | 2 | 0 |
| కిష్కింధాకాండము | ... | 2 | 8 |
| సుందరకాండము | ... | 3 | 0 |
| యుద్ధకాండము | ... | 7 | 8 |
| ఉత్తరకాండము | ... | 3 | 8 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 2 | 0 |
| తులసీదాసురామాయణము, వచనము | ... | 12 | 8 |
| శ్రీమహాభక్తవిజయము | ... | 12 | |

# తిక్కన సోమయాజి

(చారిత్రక నవల)

రచయిత : తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

ఆంధ్ర మహాభారతమున 15 పర్వములను రచించిన మహాకవి తిక్కన సోమయాజి చరిత్రను ఖడ్గతిక్కన వృత్తాంతమును గ్రహించి భావుకలోకము ఆనందపడునట్లు రచింపబడిన నవల. ఇది నిస్సంశయముగా 'మహారచన' యని ఆచార్య పింగళి లక్ష్మీకాంతము వంటివారు ప్రశంసించిరి. ఆంధ్ర భాషను ఆంధ్రదేశమును ఆంధ్రసంస్కృతిని ప్రేమించువారు తప్పక చదువవలసినది. వెల రూ. 10.

# ధర్మనిర్ణయం (నవల)

రచయిత : శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

ఆధునిక సాంఘిక సమస్యలను భారతీయ జీవనమూల్యములతో సమన్వయించి ఉజ్వలశిల్పముతో రచింపబడిన నవల.

వర్తమాన ఆంధ్రసాహిత్యములో నిది అగ్రగణ్యమైనదని, విశ్వసాహిత్యమునకే అలంకారమైనదని పండితులు, భావుకులు ముక్తకంఠముతో ప్రశంసించిరి. దీనిని ప్రశంసించినవారిలో భారతరత్న శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ (పూర్వ రాష్ట్రపతి) పద్మభూషణ, కళాప్రపూర్ణ కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ ఆచార్య పింగళి లక్ష్మీకాంతము, శ్రీ నార్ల వేంకటేశ్వరరావు మొదలగువారున్నారు. వెల 10రు.

వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు
26, రామానుజ అయ్యర్ వీధి, మద్రాసు 21.